# ఉపనిషత్పాఠములు

# LESSONS FROM THE UPANISHADS

తొలిపలుకు
శ్రీ వినోబాభావే

గ్రంథకర్త:
అయ్యదేవర కాళేశ్వరరావు

# ఉపనిషత్పారములు

# Lessons From The Upanishads



తొలిపలుకు
శ్రీ వినోబా భావే

గ్రంథకర్త:
అయ్యదేవర కాళేశ్వరరావు

వెల రు. 1—0—0.

బెజవాడ ఆంధ్రగ్రంథాలయ ముద్రాశాలయందు
అయ్యంకి వేంకటరత్నము M. Sc. గారిచే
ముద్రింపబడినది. 1944.

## प्राक्कथन

(श्री विनोबा भावे)

उपनिषदोंने ईश्वरको 'सत्य' नाम से पहिचाना है, और उसकी निरंतर खोज और उपासना को ही धर्म माना है। ईश्वरके तो अनंत नाम हो सकते हैं। भक्तोंने उसको 'प्रेममय' कहा है। लेकिन प्रेम तो विकारी भी होसकता है। इसलिए उससे अलग पहिचानने केलिये वहाँ प्रेम की निर्विकार व्याख्या करनी होतीहै। सत्य के विषय में ऐसी कोई व्यख्या कीजरूरत नहीं रहती। सत्य तो निर्विकार ही हो सकता है।

सत्य को लक्ष्य मानने के कारण उपनिषदों की विचारपद्धति वैज्ञानिक बनी है। यहाँ बुद्धिवादकी निंदा नहीं है। बल्कि उसी का आधार है। बुद्धिवादकी कसौटी पर कस के हर चीज को लेना या छोडना है।

लेकिन बुद्धिवाद का मतलब निर्णय-रहित शुष्क तर्क नहीं है। चित्तशुद्धि के बगैर अचूक निर्णय-शक्ति असंभवित है। इसलिये यमनियमादि के द्वारा चित्त-शुद्धि करने पर उपनिषदों ने जोर दिया है।

चित्त-शुद्धि द्वारा सूक्ष्म की हुई बुद्धि से सत्य को खोजो, और प्राप्त हुए हुए सत्य का, जीवन में प्रयोग करो। यह उपनिषदों का शिक्षण है। कितना चैतन्यमय शिक्षण है यह! उपनिषदों ने खुदही कहा है कि "इसका सिंचन अगर किसी सूखी लकडी पर भी किया जाय तो वो पल्लवित हुए बगैर नहीं रहेगी"।

श्री कालेश्वररावजी ने इसका सार थोडे में हमारे सामने रखा है। वह हमें लाभदायी होगा। ऐसी मैं उम्मीद करता हूँ। क्या हम सूखी लकडी से भी अधिक जड होंगे!

— विनोबा.

# తొలి పలుకు

## (శ్రీ వినోబా భావే గారు)

ఉపనిషత్తులు ఈశ్వరుని 'సత్యము' అను పేరున తెలిపినవి. మరియు ఈశ్వరుని నిరంతరాన్వేషణమును ఉపాసనగు కర్తవ్యమని విధించినవి. ఈశ్వరుని నామము లనంతములు. భక్తులు ఈశ్వరుని 'ప్రేమమయు'డనిరి. కాని ఐహిక ప్రేమ వికృతమైనది కూడ కావచ్చును. గనుక ఆ ఐహిక ప్రేమ కంటె భిన్నమైన దానిగ తెలిసికొనుటకు ఈ ఈశ్వర ప్రేమను నిర్వికార మైనదని చెప్పవలసి యుండును. సత్యమున కట్టి వ్యాఖ్యను చేయవలసిన యవసరము లేదు. సత్యము నిర్వికారమైనది మాత్రమే.

సత్యమును లక్ష్యముగా పెట్టుకొనిన కారణముచే ఉపనిషత్తుల విచార పద్ధతి విజ్ఞానముమీద నిర్మింపబడినది. ఇచ్చట బుద్ధివాదము (హేతువాదము)న కేమియు న్యూనత లేదు. పైగా బుద్ధివాదము విజ్ఞానమునకు బలమును కలుగ జేయు చున్నది. బుద్ధివాదముతో నిశ్చయించిన పిమ్మటనే దేనినైనను స్వీకరించుట గాని తిరస్కరించుట గాని జరుగుచుండును. కాని బుద్ధివాదమున కర్థము నిర్ణయ రహిత శుష్కతర్కము కాదు. చిత్తశుద్ధిలేనిది మహాత్తరమైన దానిని నిర్ణయించ గలుగుట యసంభవము. ఇందువలన యమ నియమాదుల ద్వారా చిత్తశుద్ధిని బడయుటకే, ఉపనిషత్తులు ప్రాధాన్యమిచ్చి యున్నవి.

చిత్తశుద్ధి ద్వారా సున్నితముగా చేయబడిన బుద్ధితో సత్యాన్వేషణము చేయుము. మరియు ఈ అన్వేషణముచే లభించుచుండు సత్యమును జీవితము నందు ప్రయోగించుము. ఇది యుపనిషత్తుల శిక్షణము. ఇది యెంతటి చైతన్యమయమైన శిక్షణయై యున్నది! దీనిని బాగుగ యెండిన మ్రానుల మీద చల్లినను అవి చిగిర్చకుండ నుండనేరవని ఉపనిషత్తులే స్వయముగా చెప్పి యున్నవి.

శ్రీ కాశేశ్వరరావుగారు దీని సారమును కొద్దిలో మన యెదుట నుంచినారు. ఇది మనకు లాభదాయక మగునని ఆశించు చున్నాను. మనము ఎండిన కాష్ఠముల కంటె నిర్జీవులమా ?

వినోబా.

## ద్వితీయ ముద్రణమునకు

# పీఠిక

ఈ గ్రంథము తొలిసారి శ్రీ భిషగ్రత్న డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారి ఆయుర్వేదశిక్ష యొక్క దర్శనములను సంపుటములో భాగముగ ప్రచురింపబడినది. ఇపుడు దీనిని కొలది మార్పులతో స్వతంత్ర గ్రంథముగ ప్రచురించుచున్నాను.

ప్రకృతి శాస్త్రజ్ఞానమువలెనే ఆధ్యాత్మికజ్ఞానముకూడ మానవుల కుపకరించు మహాశక్తి. ఇది మానవుల నైతికస్వభావమును పెంపొందింపజేసి యుత్తమోత్తమ పురుషులను సృష్టి చేయును. సహేతుకమైనట్టియు (rational) సశాస్త్రీయమైనట్టియు (Scientific) ఆధ్యాత్మిక జ్ఞానమునందును శిక్షణమునందును అనుభవమునందును భరతవర్షము తక్కిన అన్ని దేశములకంటె నేటికిని గొప్పదై యున్నది. ఈదేశము ఇదివరకు లోకములో గురుపీఠము నధిష్ఠించి యుండుటయేగాక, ముందుకును అట్టిస్థానము నాక్రమించు కాలము సమీపముననే యున్నది. నిన్న మొన్నటిదనుక మతప్రచారమును పూర్తిగ నిషేధించిన సోవియటు రష్యాలో నీ యుద్ధఫలితముగ మతస్వేచ్ఛ ప్రకటించబడినది. అచటి విద్వాంసులు మన ఉపనిషత్తులను మహాభారతమును తమ భాషలోనికి తర్జుమా చేయించుకొని పఠించుచున్నారు. ఇట్టి బలమైన జాతీయశక్తిని నాశనమగునటుల విడిచివేసి యితర జాతులకు బలముగా నున్న విషయములలో వారికి శిష్యత్వముమాత్రము చేయుచుండుట జాతీయవాదుల కర్హమైన పనికాదు. మన జాతిలో గల యుత్తమశక్తుల నన్నిటిని పునరుద్ధరించి ప్రాత పునాదులమీదనే నూతన జాతీయ సౌధ పునర్నిర్మాణము గావించుట భారతజాతీయవాదుల కర్తవ్యము.

—గ్రంథకర్త.





## ఉపనిషత్పాఠములు

# ఉపోద్ఘాతము

1. ఉపనిషత్తులు భారతీయధార్మికజీవనమునకేగాక మానవకోటియొక్క ఆధ్యాత్మిక జీవితమునకు పునాది గ్రంథములని చెప్పుటలో నతిశయోక్తి లేదు. వేదములు ఇవ్వదలచిన విజ్ఞానమునకు గమ్యస్థానమైనందునను వేదములయొక్క సారమైనందునను ఉపనిషత్తులు వేదాంతమనికూడ పిలువబడుచున్నవి. వైయాకరణుల అర్థప్రకారము ఉపనిషత్తులనగా బ్రహ్మమును పొందచేయునవి. "పశుబలమే ధర్మము, బలవంతులదే రాజ్యము" అను నమ్మకములు మానవులందరిలో ప్రబలియున్నవని సాంఘికశాస్త్రజ్ఞులు (Sociologists) చెప్పు కాలములో, ఇప్పటికి ఏడువేల సంవత్సరముల పైకాలమున, భరతవర్షమునుండి ఉపనిషత్తులు "ఈసృష్టి కంతకు ప్రభువైన ఈశ్వరుడొక్కడే, ఆయన సర్వవ్యాపి, అందరిమానవుల హృదయములలో కూడ నున్నాడు, ఆయన స్వరూపమే ధర్మము, ఆయన పేరే సత్యము, ధర్మమే సత్యము, ధర్మముకన్న గొప్పది లేనే లేదు, ధర్మపక్షము నవలంబించినవాడెట్టి బలహీనుడైనను, అధర్మప్రవర్తనగల గొప్ప బలవంతుని యోడించగలడు. ధర్మపక్షమున పోరాడు వానికి జయము తప్పదు. ఇది ఈశ్వరశాసనము" అని చేసిన విస్పష్టమైన ప్రకటన మానవులభావములలోను ఆదర్శములలోను నైతిక విప్లవమును (Moral revolution) కలుగ జేసినది. అది నేటికిని ముందు

కును మానవులకును మానవసంఘములకును మానవజాతులకును వర్తించుచున్న ఈశ్వరశాసనము.

రెండవది యేమనగా—"ఎవరును తాను చేసిన అధర్మ కార్యములకు శిక్ష తప్పించుకొనజాలడు. ప్రభుత్వ మాతనిని శిక్షించక పోయినను ఈశ్వరుడైన శిక్షించును. ఈ జన్మలో గాకపోయినను, మరియొక జన్మలో నైనను తగిన శిక్ష కలుగును. దుఃఖము కలుగును. అతనికి చెడుజన్మ కలుగును. అటులనే ధర్మమైన పనులు చేసిన వానికి సుఖము కలుగును. ఈశ్వరానందము కలుగును. అతడు మంచిజన్మ మెత్తును. ఇటుల ప్రతి మానవుడు తనయొక్క బాగోగులకు తానే కర్తగా చేయబడినాడు. ఇది కర్మ సిద్ధాంతము. ఇది మానవులకే గాక మానవ సంఘములకును, మానవ జాతులకును వర్తించును. (Righteousness exalteth a nation). ధర్మావలంబన యొక జాతిని పైకెత్తును. అధర్మకార్యము లొక జాతి నధోగతికి దెచ్చును. ఇది యెప్పటికైనను జరుగును. జరుగక తప్పదు. ఎట్టి పాపాత్ముడైనను (అధర్మప్రవర్తకుడైనను) పశ్చాత్తాప పడి మంచి త్రోవలోనికి వచ్చుటకు ఎపుడు పడితే అపుడే అవకాశము కలదు. అట్లు ప్రయత్నించు వానికి పైకి వచ్చుటకు ఈశ్వరసహాయము కలుగును. ఒకజన్మలో చేసిన మంచిచెడుగులను బట్టియే శాశ్వతానందము శాశ్వతనరకము కలుగునని కొంతమంది నమ్ముచున్న విషయము సహేతుకము కాదు. మానవుడు శాశ్వతమైన జీవుడు. మోక్షముపొందు వరకును జన్మముల నెత్తుచుండును. అధర్మరహితుడై దుఃఖవిముక్తినొంది శాశ్వతానందమును బొందుటకు ఏ జన్మలోనైనను అవకాశము

ఎప్పుడుపడితేఅప్పుడు కలదు" అను సందేశమును ఉపనిషత్తులు ఇచ్చుచున్నవి.

మూడవది ఏమనగా:—"మానవుడు శరీరముకాదు. శరీరములోనున్న శాశ్వతుడైన జీవుడు. శరీరము చంపబడినను జీవుడు చంపబడనేరడు. జీవుడు సహజముగ స్వతంత్రుడు. జ్ఞాన స్వరూపుడు. ప్రతి మానవుడును స్వతంత్రుడ ననియు, తనసేవ రును బంధింప జాలరనియు వధింప జాలరనియు గట్టినమ్మక ముంచుకొనవలెను. నిర్భయుడుగా నుండవలెను. తన బాగోగు లకు తానే కర్తనని తెలుసుకొన వలెను" అని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. మానవులు స్వతంత్రులు, స్వాతంత్ర్యము వారికి సహజమైన జన్మ హక్కు, అను సిద్ధాంతమునకు ఇది నిజమైన పునాది. ఇంతే గాక "ఈశ్వరుడు సర్వశక్తి గలవాడు, విజ్ఞాన ఘనుడు, సర్వజ్ఞుడు, సృష్టిలోని సర్వశక్తులను నడుపుచున్న శాసనకర్త. సృష్టి (Evolution) ప్రళయము (Involution) లకు నియామకుడు. ప్రాణమునకును శరీరమునకును ప్రభువు, తేజస్సునకు స్థానము. ప్రేమ, సత్య, ధర్మ, జ్ఞానానంద స్వరూపుడు. అట్టి పరిపూర్ణుడగు పరమపురుషుడు ఈ విశ్వమునంతను ఈ విశ్వములోని ప్రతి చిన్న భాగములోను వ్యాపించి యున్నాడు. ఆయన మానవుని హృదయములో కూడ నున్నాడు" అని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. గావున ప్రతి మానవుని శరీరము ఈశ్వరుని దేవాలయమై పరమ పవిత్ర మగు చున్నది. ఈ సంగతి గ్రహించి ప్రతిమానవుడును హృదయపారిశుద్ధ్యమును గలిగి యుండవలెను. ఏ స్త్రీని అపవిత్ర మైన తలంపుతో చూడకూడదు. ఏమానవుని తనకన్న తక్కువ

వానిగా చూడకూడదు. ఇతర మానవులకన్న తామెక్కువ వారమను అహంకారమును మానవులు వదలుకొనవలెను. నీలోనున్న ఈశ్వరుడే సర్వమానవుల హృదయములలోకూడ నున్నందున ఈశ్వరుని ద్వారా నీకు సర్వమానవుల ఐక్యత, సర్వమానవ సమానత్వము, సర్వమానవ సోదరత్వము ఏర్పడి నది. "ఈశ్వరుని సర్వభూతములందును ఉన్నటుల సర్వదా తెలిసికొనవలెను. నీవలెనే సర్వమానవులనేగాక సర్వభూతము లను కూడ ప్రేమించి వారి కష్టములు నీవిగనే యెంచి వారి దుఃఖనివారణ కొరకు కృషిసల్పుము. సర్వభూతదయ కలిగి యుండుము. అహింస నవలంబింపుము. త్యాగము చేయుము" అని ఉపనిషత్తులు బోధించుచున్నవి. ఉపనిషత్తులు బోధించెడి మానవసమానత్వము, సోదరత్వము, స్వాతంత్ర్యము ఫ్రెంచి విప్లవ నాయకులగు రూసో, వాల్టేరు మహాశయుల మానవ సమానత్వము సోదరత్వము స్వాతంత్ర్యముల కన్న ఎక్కువ దృఢమైన శాశ్వతమైన పునాదులమీద స్థాపించబడుచున్నవి. ఇంతేగాక ఈశ్వరుని అనంతశక్తి నీ లోపల నున్నది. చిత్తశుద్ధి కలిగినచో దానిసహాయము నీకు లభించును. దాని సహాయ మును పొంది ఆత్మస్వతంత్రము, ఆత్మవిశ్వాసము, ఆత్మశక్తి కలిగి గొప్పకార్యములను చేయుటకు ప్రయత్నించుము. చేత గాని వాడనని తలంచకుము.

నాలుగవది అతి ముఖ్యమైనది ఏమనగా:—ఉపనిషత్తుల ఋషులు పరిపూర్ణుడైన పరమాత్మను స్వయముగ పొందిన వారై ఆయన యొక్క స్వభావ స్వరూపములను వర్ణించి యున్నారు. సత్యవాక్పరిపాలనాదక్షు డగు శ్వేతాశ్వతర

మహర్షి "అంధకారమునకును అజ్ఞానమునకును ఆవలి యొప్పుచు నున్న వ్యయంప్రకాశమానుడును సర్వజ్ఞుడును నగు పరమ పురుషుని నేను పొందినాను" అని చెప్పినాడు. అట్టి మహా ఋషులు పరమేశ్వరుని ఆరాధన మనగా "పరమేశ్వరునివలె నగుటకు ప్రయత్నించుట''యని స్పష్టముగా చెప్పియున్నారు. మానవుడు తన అల్పజ్ఞత్వమునుండి ఈశ్వరునివలె సర్వజ్ఞత్వ మును పొందుటకును (From finite to infinitude) తన అపరి పూర్ణత్వమునుండి ఈశ్వరునివలె పరిపూర్ణత్వమును పొందు టకును (From imperfection to perfection) తన లోప భూయిష్ఠతనుండి ఈశ్వరునివలె పాపరహితమైన పరిశుద్ధమైన సత్యధర్మ ప్రేమస్వరూపము నొందుటకును (From human to divine ) సదా కృషి సలుపుటయే మోక్షమార్గము. ఇదియే సమస్త నీతికిని ధర్మమునకును మూలసూత్రము. ఈ కృషి సలిపి పైపైకి పోయినకొలదియు మానవునికి ఆత్మశక్తి విజృంభించును. ఆనందమయుడైన ఈశ్వరునియొక్క ఆనందము ఈ కృషిలో కలుగును. కృషియెక్కువైన కొలదియు ఆత్మశక్తి ఆనందములు ఇంక నెక్కువగును. ఈ జన్మలో కొంతవరకు సాధించినయెడల ముందుజన్మలోనైనను మానవుడు (జీవుడు) గమ్యస్థానమును చేరగలడు. జీవుడు ఈశ్వరునివంటి ఆధ్యాత్మిక స్వభావము కలిగినవాడైనందున తిరిగి ఈశ్వరునివలె అయి ఈశ్వరుని పొందుటకు శక్తి కలిగి యున్నాడు. కొన్ని యితర మతములలో ఈశ్వరుని నమ్మినందువలన (Faith) సుఖములు అనుభవించు లోకమందు జీవుని పడవేతురని తలచబడు చున్నది. ఉపనిషత్తుల ప్రకారము వట్టినమ్మకము (Faith)

మోక్షము నివ్వజాలదు. "Becoming" అనగా ఈశ్వరుని వలె అగుటయే మోక్షమార్గము. ఈశ్వరు డను వీణాగానము లోని మధురశ్రుతులలో మానవుడు (జీవుడు) ఒక మధురశ్రుతి కావలెను. తక్కిన శ్రుతులతో సమానముగ మాధుర్యము నిచ్చు శ్రుతి గానిచో, అపశ్రుతి నిచ్చును గావున ఆ వీణాగాన ములో భాగ మగుటకు అర్హత లేదు. (బృహదారణ్యక). ఆ మధురశ్రుతి అయినపుడు జీవుడు ఈశ్వరుని పొందును. అపుడే దుఃఖభాజనమైన జనన మరణ చక్రమునుండి జీవునికి విముక్తి కలుగును. మోక్షము శాశ్వతానందము కలుగును. ఈశ్వరుని పొందినపిమ్మట కూడ జీవుడు తన వ్యక్తిత్వమును నిలుపు కొనును (తైత్తిరీయ, ఛాందోగ్య). ఈశ్వరుని పొందినపిమ్మట కూడ జీవుడు సర్వస్వతంత్రుడై ఈశ్వరుని ధర్మసంస్థాపన కార్యముకొరకు అనేక లోకములలో అనేకమైన అవతారము లెత్తుచుండును. ఉపనిషత్తులు "ధీరాః" ధీరులు అను శబ్దమును తఱచుగా నుపయోగించు చున్నందున, మోక్షమును కోరు వాడు అనగా ఈశ్వరునివలె కావలెనని ప్రయత్నించువాడు ధీరుడై, శ్రీరాముడు, బుద్ధుడు, మొదలగు, నాటినుండి నేటి వరకును జన్మించిన మహాపురుషులవలె Dynamic personality కావలెను. Passivity కూడదు. అనగ ఆత్మశక్తిని నైతిక శక్తిని బుద్ధిబలమును విజ్ఞానమును సంపాదించి దానినంతను తీవ్రమైన మానవసేవలోను దేశసేవలోను వినియోగింపవలెను. పేదరికములోను అజ్ఞానములోను కష్టములోను మగ్గు చున్న కోట్లకొలది ప్రజల నుద్ధరించవలెను. అధర్మమును పారద్రోలి ధర్మమును స్థాపించుటకు నిరంతరము కృషి

నలుపవలెను. అంతేగాని ఈశ్వర ధ్యానము చేసుకుంటున్నా మను పేరున ముడుచుకొని కూర్చొన కూడదు. నలుబదికోట్ల భారతీయులును రెండువందలకోట్ల మానవులును సర్వభూత ములును ఈశ్వరుని శరీరమైయున్నదని ఉపనిషన్మతము. దీనికి విరాట్ స్వరూపమని, నారాయణుడని పేరు. గావున మాతృ దేశసేవను మానవసేవను సర్వభూతసేవను చేయుటయే ఈశ్వర సేవ అయియున్నది. ఇంకొక విధముగ ఈశ్వరసేవచేయ వీలు లేదు.

ఈశ్వరుడు చేసిన ఈ మహాసృష్టి యొక్క యుద్దేశ్యము అధర్మమును ధర్మము జయించుట. అనగ ధర్మసంస్థాపనమై యున్నది. ప్రతిచోటను ధర్మమునకును అధర్మమునకును పోరా టము జరుగును. ధర్మమునకు జయము కలుగును. ఇటుల క్రమ క్రమముగా మానవజాతిలో ధర్మాభివృద్ధి కలుగును. ఆదర్శ ములు పెరుగును. మానవజాతియొక్క నైతికాభివృద్ధి జరుగు టయే (Moral evolution) ఈశ్వరోద్దేశ్యము. మోక్షకామియై ఈశ్వరుని ఆరాధించుచు ఈశ్వరునివలె కావలెనని ప్రయ త్నించు మానవుడు ఈశ్వరోద్దేశ్యమైన ధర్మసంస్థాపన కార్యములో నిరంతరము కృషిసలుప వలెను. అందులో ఆత్మార్పణము గావించవలెను. అటుల ఆత్మార్పణము గావించుట మహాయజ్ఞమని ఛాందోగ్యోపనిషత్తు చెప్పా చున్నది. ఆ మహాయజ్ఞమునకు బ్రహ్మచర్యవ్రతము నిష్ఠ మైయున్నది. (ఛాందోగ్య), తపస్సు, త్యాగము, సర్వసమ త్వము, అహింస, సత్యము, అనునవి దక్షిణలు, అనగా సాధన ములు (ఛాందోగ్య). తన ఆత్మోన్నతిని కోరువాడు

ఈ అయిదు గొప్పగుణములను తన జీవితములో అవలంబించ వలెను. త్యాగమయమైన జీవితము అనునదియే మహాయజ్ఞము. త్యాగము చేసిన కొలదియు ఆత్మశక్తి వృద్ధియగును. ఈశ్వరా నందము ఎక్కువగా కలుగును. ఈశ్వరభక్తి, యథార్థజ్ఞానము, వైరాగ్యము, ఇవి ఈ యజ్ఞమునకు సహాయకారులు. మానవ కోటియొక్కయు మాతృదేశముయొక్కయు మోక్షముకొరకు త్యాగమయమైన జీవితమును నడుపుటయే తన మోక్షమునకు దారి. అంతకన్న మార్గాంతరములేదు. "నాన్యఃపంథా విద్యతే అయనాయ" ఇట్టి పరిపూర్ణుడగు పరమపురుషుని మానవులకు ఆదర్శముగా నిచ్చి ఆ ఆదర్శమును చేరుటకుగాను మానవు లాచరింపవలసిన ఆదర్శప్రాయమైన ఆరాధనను ఉపనిషత్తులు నిర్ణయించినవి. ఈ ఆరాధనము సర్వమానవుల ధర్మము, సర్వమానవులకు హక్కు అని ప్రకటించినవి. ఉపనిషత్తులు భారతీయవిజ్ఞాన వైరాగ్య త్యాగ ధర్మ పర్వత శ్రేణుల అత్యు న్నత శిఖరములో శాశ్వతమైన తేజస్సుతో వెలుగుచున్న మహాజ్యోతి. ఉపనిషత్తులకు చాల కాలమునకు పిమ్మట వచ్చిన బౌద్ధమతములో అత్యంత త్యాగమయమైన జీవితమును నడపి బుద్ధత్వమును పొందుటయే, అనగా బుద్ధునివలె అగుటయే, మోక్షమని చెప్పబడినది. అటు తరువాత వచ్చిన ఏసుక్రీస్తు ప్రభువు ప్రత్యేకముగ మోక్షమునకిదే మార్గమని నొక్కి చెప్ప నప్పటికిని "మీ తండ్రియగు పరమేశ్వరునివలె పరి పూర్ణత్వమును పొందుము." (Be Ye perfect as your Father in Heaven is) అని సెలవిచ్చి యున్నాడు.

అయిదవది యేమనగా:—ఇట్టి ఆదర్శముల నిచ్చుటయే గాక ఉపనిషత్తులు మానవుని దినచర్య కవసరమైన విధులను (practical duties) కూడ బోధించుచున్నవి. ప్రతిబాలునికిని ప్రతిబాలికకును, ఎనిమిదవ సంవత్సరము మొదలు ఇరువది అయిదవ సంవత్సరము వెళ్ళువరకు బాలునికిని, పదునారవ సంవత్సరము వెళ్ళువరకు బాలికకును బ్రహ్మచర్యాశ్రమ శిక్షణముతో విద్యనేర్పు గొప్ప జాతీయ ప్రతిష్ఠాపన దేశములో నెలకొల్ప బడినది. ఈ బ్రహ్మచర్యమును గూర్చి 5 వ పాఠము 6 వ నెంబరు మంత్రము క్రింద వ్రాయబడిన అతి ముఖ్యమైన మరాను చదువవలెనని కోరుచున్నాను. బ్రహ్మచర్యమును ఉపనిషత్తులు ప్రశంసించుచు ఆ బ్రహ్మచర్యవ్రతమును మానవుడు వివాహితుడైన పిమ్మట కూడ యావజ్జీవితములో ననుష్ఠింప వలసినదని చెప్పుచున్నవి. ధర్మార్థకామమోక్షముల నిచ్చు సమస్త విజ్ఞానమును శిక్షణమును కలుగజేసి భారతజాతిని వీర్యవంతమైన విజ్ఞానవంతమైన స్వతంత్రమైన ఆధ్యాత్మిక నైతిక ఉత్కృష్టతగల ఐహికాముష్మిక ప్రదమైన గొప్ప నాగరికత గల జాతిగ గావించినవి. ఆస్తిని అనుభవించుటలో ఈ క్రింది యుత్కృష్ట ధర్మమును ఈశావాస్యోపనిషత్తు శాసించినది:—

"కాబట్టి నీ ఆస్తిని నీవు త్యాగబుద్ధితో అనుభవించ వలెను. (అనగా నీ ఆస్తికి నీవు ధర్మకర్తవు. యజమాని పరమేశ్వరుడే. కావున నీకును నీ కుటుంబమునకును ఎంతవరకు అవసరమో దానిని మాత్రము అనుభవించి మిగిలిన దానిని లోకోపకారమునకై వినియోగించుము.) నీ వెన్నటికిని ఇతరులకు చెందిన దానికొరకు ఆశించ కూడదు." ఇందువలన

మానవులు, మానవ సంఘములు, మానవ జాతులు, ఇతర మానవులను ఇతర మానవ సంఘములను ఇతర మానవ జాతులను అణగద్రొక్కి వారి స్వత్వములను ఆస్తులను ధనములను అపహరించుట కూడని పని, అనగా అధర్మకార్యమని స్పష్టముగా చెప్పబడుచున్నది. మానవులును మానవ సంఘములును మానవ జాతులును ఇతరులకు చెందిన దానిని అపహరించ కూడదను ధర్మమును అవలంబించినచో మానవ జాతిలో శాంతి, సోదరత్వములు వెల్లి విరిసి యుండును. ఈ మంత్రము యొక్క ఉద్దేశ్యము "సర్వేజనా స్సుఖినోభవంతు" అయియున్నది. ఇట్టి యుత్కృష్ట ధర్మములెన్నియో ప్రతిపాదించి యుండుటవలన ఉపనిషత్తులు లోకములో సాటిలేనివిగ ప్రకాశించుచున్నవి.

2. భరతవర్షములో తరువాత పుట్టిన గ్రంథములన్నియు భగవద్గీత, బ్రహ్మసూత్రములు, శ్రీమద్భాగవతము, శ్రీమహాభారతము—మొదలగున వన్నియు ఉపనిషద్ధర్మములను ఎక్కువ స్పష్టముగ బోధించుటకే పుట్టినామని చెప్పుకొనుచున్నవి. కీర్తనలు, తత్త్వములు, పాటలు,పద్యములు, కథలు మొదలగు వాని మూలమున ఉపనిషత్తులలోని సత్యములు భరతవర్షములోని ప్రజానీకము యొక్క అడుగుభాగమున కూడ బాగుగ వ్యాపించి భారతజాతిని పరమార్థ చింతనగల ధార్మిక జాతిగా గావించినవి. భరతవర్షమునందు తరువాత జన్మించిన మహా సంస్కర్తయగు గౌతమబుద్ధుడు ఈశ్వరారాధనను మాత్రము వదలిపెట్టి మిగత జీవునికి పునర్జన్మము, జన్మరాహిత్యము, సత్యము, ధర్మము, అహింస, జితేంద్రి

యత్వము, సర్వభూతములయందు దయ, సర్వసమత్వము మొదలగు ఉపనిషత్సిద్ధాంతములనే తన మతములో బోధించి యున్నాడు కొన్ని శతాబ్దములకు పిమ్మట సిద్ధనాగార్జున యోగిచే ఈశ్వరారాధనము కూడ బౌద్ధమతములో ప్రవేశ పెట్టబడి మహాయానశాఖ స్థాపించబడినది. ఆ మహాయాన శాఖయే చైనాకు గొనిపోబడిన బౌద్ధమతము. ఏసుక్రీస్తు ప్రభువు యొక్క ప్రేమతత్త్వముగాని, మహమ్మదు ప్రవక్త బోధించినన యేకేశ్వరోపాసన గాని ఉపనిషత్తులలో లేని నూతన సిద్ధాంతములు కావు.

3. మాక్సుముల్లరు మొదలగు పాశ్చాత్య దేశములలోని ప్రాచ్యవిజ్ఞానకోవిదులు ఉపనిషత్తులుపుట్టి ఇప్పటికి షుమారు మూడువేల సంవత్సరము లైనదని చెప్పినారు. కాని, ఇటీవల ఈజిప్టులోను, భరతవర్షములోని మహేంజదారో, హరప్ప ప్రాంతములలోను, త్రవ్వబడిన శిథిలముల పరిశోధనల వలన క్రీ. పూ. 5000 సంవత్సరముల పైకాలముననే ఈ రెండు దేశములలో గొప్ప నాగరికతలు వృద్ధిచెంది విలసిల్లు చుండె నని స్పష్టముగ తేలినది. ఇటీవల జరిగిన భూగర్భశాస్త్ర పరి శోధనల వలన పాశ్చాత్య చరిత్రకారులు ప్రాచీన నాగరికతల పుట్టుకను గూర్చి తమ అభిప్రాయములు మార్చుకొన్నారు. అదివరకు క్రీ. పూ. 4004 వ సంవత్సరమున ఈ సృష్టి చేయ బడినదని బైబిలులో చెప్పినది ఆధారము లేని విశ్వాసమని త్రోసివేసినారు. మన "ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే" అను దానిని శ్రీమద్భాగవతములో చెప్పబడిన రీతిని లెక్కించగా ప్రస్తుత

సృష్టిపుట్టి 195 కోట్ల సంవత్సరము లయినటుల తెలుచున్నది. ప్రస్తుత సృష్టి యని యేల నంటిననగా మన గ్రంథముల ప్రకారము సృష్టి (evolution) ప్రళయము, (involution) మరల సృష్టి ప్రళయము, ఈ విధమైన చక్రము అనంతమైన కాలములో నెల్లప్పుడును తిరుగుచునేయుండును. ప్రపంచ చరిత్రకారుడగు హెచ్. జి. వెల్సు పండితుడు సృష్టిపుట్టి షుమారు 200 కోట్ల సంవత్సరము లయినటుల భూగర్భశాస్త్ర పరిశోధనలు స్పష్టీకరించిన వని వ్రాసియున్నాడు. ఇంతే గాక భరతవర్షము, చైనా, ఈజిప్టు దేశములలో క్రీస్తుకు ఏడువేల సంవత్సరములకు పూర్వమే నిలుకడమైన నాగరికత లుండెనని వ్రాసియున్నాడు. కావున వేదములలో భాగమైన ఉపనిషత్తులు నేటికి ఏడువేల సంవత్సరములకు పూర్వమే పుట్టె నను టలో నతిశయోక్తి లేదు.

4. ఉపనిషత్తులు సత్యాన్వేషులు శ్రమపడి కనుగొన్న శాశ్వతసత్యములై, హేతువాదమునకును ప్రకృతిశాస్త్ర జ్ఞానాభివృద్ధికిని సరిపడునవై, కట్టుకథలుగాని కవిత్వపు అతిశయోక్తులు గాని గాక, యథార్థజ్ఞానము నిచ్చుచున్న నగుటవలన, నేటికిని ముందుకును భారతీయులనే గాక మానవ కోటి నంతను ఉద్దేశించి మానవులు మానవసంఘములు మానవజాతులు మంచి మార్గములో నడచుటకు ప్రేరేపించ గల శక్తిమంతములై యున్నవి.

ఉపనిషత్తుల పేర తర్వాతకాలములో పుట్టిన వానిని వదలివేయగా నిలచిన ఉపనిషత్తులు నూటయెనిమి దని పండితులు చెప్పుచున్నారు. వాటిలో అతి ముఖ్యమైనవని పరమ

ప్రమాణములని అంగీకరించబడినవి పదకొండు అయియున్నవి. శ్రీ శంకరాచార్యులవారు తమ సుప్రసిద్ధమైన ఉపనిషద్భాష్యమును ఈ ఏకాదశోపనిషత్తుల నాధారముగ జేసి వ్రాసియున్నారు. శ్రీ రామానుజాచార్యులవారు కూడ తమ గొప్పభాష్యమును వీటిలో మొదటి పదింటిమీద ఆధార పరచినారు. ఆ పదకొండు ఏవనగా (1) ఈశావాస్య, (2) కేన, (3) కఠ, (4) ప్రశ్న, (5) ముండక, (6) మాండూక్య, (7) తైత్తిరీయ, (8) ఐతరేయ, (9) ఛాందోగ్య, (10) బృహదారణ్యక, (11) శ్వేతాశ్వతరోపనిషత్తులు. ఏకాదశోపనిషత్తులలో ఐతరేయోపనిషత్తు ఋగ్వేదముయొక్క భాగము. ఈశావాస్య, బృహదారణ్యకోపనిషత్తులు, శుక్లయజుర్వేదముయొక్కయు; కఠ, తైత్తిరీయ, శ్వేతాశ్వతరోపనిషత్తులు కృష్ణయజుర్వేదముయొక్కయు భాగములు. కేన, ఛాందోగ్యోపనిషత్తులు సామవేదముయొక్కయు; ప్రశ్న, ముండక, మాండూక్యోపనిషత్తులు అథర్వవేదముయొక్కయు భాగములై యున్నవి. ఈ పదకొండు ఉపనిషత్తుల నుండియే ఈ యుపనిషత్పాఠములు తీసికొనబడినవి.

5. ప్రప్రథమమున జ్ఞానసూర్యు డుదయించి గొప్ప నాగరికతలను నిర్మాణము గావించుకొనిన ప్రాచీనజాతులలో, సుమేరియా, అస్సీరియా, బాబిలోనియా, ఫోయినీషియా, క్రీటు, ఛాల్డియన్ జాతులు, వారి నాగరికతలు ఊరు పేరు లేకుండ పోయినవి. నాటినుంచి నేటివరకుకూడ జీవించియున్న జాతులు మూడు మాత్రమే. అవి భరతవర్షము, చైనా, ఈజిప్టు జాతులు. వీటిలో ఈజిప్టుయొక్క ప్రాచీన నాగరికతకు

తగిన ఆధ్యాత్మిక పునాదులు గాని నైతికబలము గాని లేక పోవుటవలన రెండు గొప్పవిదేశపాలనముల క్రింద ఈజిప్టు యొక్క ప్రాచీననాగరికత తుడిచిపెట్టుకొని పోయినది. క్రీస్తు శకప్రారంభమున వచ్చి ఆరువందల సంవత్సరములు పాలించిన రోమనుపాలనముక్రింద ఈజిప్టు తన నాగరికతను మతమును వదలిపెట్టి రోమనుల నాగరికతను వారు ప్రవేశపెట్టిన క్రైస్తవమతమును అవలంబించి క్రైస్తవదేశ మయినది. పిమ్మట, క్రీ. శ. 641 వ సంవత్సరము నుండి అనేకశతాబ్దములు పాలించిన అరబ్బుఖలీఫాలపాలనములో ఈజిప్టు ఇస్లాము మతమును స్వీకరించి అరబ్బుల భాషను విజ్ఞానమును నాగరికతను అవలంబించి యిపుడు ప్రధాన అరబ్బు జాతులలో నొకటిగ నున్నది. అచట నూటికి ఎనిమిది మందిమాత్రము క్రైస్తవులున్నారు. మిగిలినవారందరు ముసల్మానులు. క్రైస్తవులు కూడ వేషభాషలలో ముసల్మానుల వలెనే యుందురు. ప్రస్తుత ఈజిప్టుకును ప్రాచీన ఈజిప్టుకును ఫారో రాజుల గోరీలగు పిరమిడ్లు తప్ప ఏకత్వమును కనపరచు చిహ్నములు మరేమియు లేవు.

చైనాజాతిలో ఈశ్వరారాధనము మొదలగు ఆధ్యాత్మికజ్ఞానము ప్రథమమున ప్రబలకుండినను, కన్ ఫ్యూషియసు, మెన్ షియసు, టావో, మొదలగు మహాపురుషుల బోధల ఫలితముగ, అత్యంతమైన నైతికోత్కృష్టత కలిగి యున్నందున, ఆ జాతి నేటికిని తన ప్రాచీననాగరికతను జాతీయ వ్యక్తిత్వమును నిలుపుకొని యున్నది. చైనాకు ఆధ్యాత్మికజ్ఞానము భరతవర్షమునందు పుట్టిన గౌతమబుద్ధునిమతమును

స్వీకరించుట వలన కలిగినందున, భరతవర్షమును తనకు గురువుగా చైనాజాతి గౌరవించుచున్నది. భరతవర్షము తన సహజమైన ఆధ్యాత్మిక సంపన్నత వలనను, నైతికోత్కృష్టత వలనను గొప్ప జాతిగా నేటికిని నిలచియున్నది. భరతవర్షము యొక్క జాతీయజీవితము యొక్క యుత్కృష్టతకు ఉపనిషత్తులే ముఖ్యకారణమై యున్నవి. ఈ దేశము వేలకువేలు సంవత్సరములుగ స్వాతంత్ర్యము ననుభవించి ధర్మభూమియై ధనధాన్యసమృద్ధిని సుజ్ఞానమును కలిగియుండెను. ప్రకృతిశాస్త్రములను పరిశ్రమలను కళలను శిల్పములను అత్యంతముగ వృద్ధి చేసుకొనెను. సర్వతోముఖమైన, ఐహికాముష్మికప్రదమైన నాగరికతను స్థాపించి కాపాడుకొనెను. లోకములో నగ్రస్థానము నాక్రమించెను. భారతీయ వైద్య వేదాంతగణిత జ్యోతిష ప్రకృతిశాస్త్రాది విజ్ఞానము అరబ్బుదేశములకును అచటనుండి యూరపు ఖండమునకును ప్రసరించెను. అయిదు వందలసంవత్సరములకిందట (Renaissance) యూరపులోని మానసిక వికాసముతో ప్రారంభమయి అతిత్వరితముగా వృద్ధిచెంది యౌవనశక్తితో ప్రపంచమంతటను ఆక్రమించిన పాశ్చాత్యనవనాగరికత భారతదేశమునుగూడ ఆక్రమించుట వలన భారతజాతీయనాగరికత బాగుగా క్రిందికి త్రోయబడినది. గాని భారతజాతి బ్రతికియున్నజాతి (Living Nation) యగుటచే స్వకీయమైన ఆధ్యాత్మికశక్తివలన మేలుకొని మరల తన సొంత నాగరికతను స్వాతంత్ర్యమును విజ్ఞానమును ఆర్థికసంపత్తిని పునరుద్ధరించుకొనుట కొరకు గట్టిగా కృషి సలుపుచున్నది. కొలదికాలమునుంచియు మరియొక నూతననాగరి

కతయగు రష్యాకమ్యూనిస్టు నాగరికతకూడ భారతజాతీయ నాగరికతను జాతీయజీవనమును ఎదుర్కొనుచున్నది. మన భారతజాతీయ జీవనపునర్నిర్మాణమును గూర్చి యోచించు నపుడు మన జాతీయనాగరికతకు పోటీగవచ్చుచున్న పాశ్చాత్య నాగరికతయొక్కయు, రష్యాకమ్యూనిష్టు నాగరికతయొక్కయు గుణదోషములను సానుభూతితోనే విమర్శించవలసిన యావశ్యకత యేర్పడినది.

6. పాశ్చాత్యనాగరికత మానవాభివృద్ధి కవసరమైన ప్రకృతిశాస్త్రజ్ఞానమును అత్యంతముగ వృద్ధిచేసినది. జాతీయత (Nationality) ప్రజారాజ్యము (Democracy) లను సిద్ధాంతములను స్థాపించినది. బానిసత్వమును రద్దుపరచినది. కాని కేవలము ఐహిక నాగరికతయై ధనసంపాదనమే ప్రధానముగ చేసికొని గొప్పపారిశ్రామికయంత్రశాలలు, షావుకారుజాతి, ప్రపంచ అంగళ్ళు, రాజ్యకాంక్ష, వృద్ధిచెంది, పోటీలలోనికిని పోరాటములలోనికిని ఈడ్వబడినది. పాశ్చాత్యదేశములలో పెద్ద పరిశ్రామికయంత్రశాలలు, గనులు, రైళ్ళు, స్టీమర్లు మొదలగునవన్నియు షావుకార్ల చేతులలోనుండి, మధ్యమతరగతి ప్రజలు కార్మికులు షావుకార్లక్రింద పనిచేసి జీవించవలసివచ్చుటచే సంఘములోను శాసనసభలలోను ప్రభుత్వములోను ధనికవర్గమునకు విశేషమగు పలుకుబడి యేర్పడినది. షావుకార్లపై కార్మికుల తిరుగుబాటే కమ్యూనిజమైయున్నది.

కమ్యూనిజం స్థాపనాచార్యులగు కారల్ మార్క్సు మహాశయుడేమి 26 సంవత్సరముల క్రిందట రష్యాకమ్యూనిష్టు నాగరికతను స్థాపించిన లెనిన్, స్టాలిన్ మహాశయులేమి తమ

ఆదర్శములకొరకు అఖండత్యాగములను చేసినధీరులు. రష్యా లోని నిరంకుశరాజరికమును ప్రభువర్గమును కూలద్రోసినారు. వారియొక్క "జాతీయ ధనమును పెద్ద యంత్రశాలల యజమానులగు షావుకార్లు మాత్రమే అనుభవించకూడదు. అందరికిని న్యాయముగా పంపిణీకావలెను. కోట్లకొలది కార్మికులకు షావుకారుజాతినుండియు, కోట్లకొలది రయితులకు జమీందారిపద్ధతినుండియు విముక్తి కావలెను'' అను ఆశయములు మిగుల యుత్కృష్టములై యున్నవి. కమ్యూనిష్టు రష్యాలో జనసామాన్యమున కుపకరించు కొన్ని నూతన ఆర్థిక విద్యావిషయిక కార్యక్రమములను ఏర్పాటుచేసి సాగించుచున్న మాట వాస్తవమే. కాని వారిదృక్పథము పాశ్చాత్యనాగరికతయొక్క భౌతిక (Materialistic) ఆవరణ దాటలేదు. కారలు మార్క్సు మహాశయుడు (Materialistic Interpretation of History) మానవచరిత్రను భౌతికదృష్టితోనే విమర్శించవలెను, అను సిద్ధాంతమును స్థాపించినాడు. ఆధ్యాత్మికతత్త్వము మానవుల కనర్థదాయకమని స్పష్టముగా వారు ఖండించుచున్నారు. నిరీశ్వరవాదులై ఈశ్వరుడు జీవాత్మ మోక్షము మొదలగు నమ్మకములను మానవులు వదలివేయవలెనని వారి బోధలై యున్నవి. వారు పాశ్చాత్యనాగరికతలో నొక ముఖ్యభాగమైన షావుకారు తత్వముతో (Capitalism) పోరాడుటలో మానవులకు అసలే సొంతభూములు సొంతఆస్తి వారసత్వపు హక్కులుండకూడ దను రెండవకొనకు పోయినారు. ఇతరవర్గముల నన్నింటిని అత్యంతదౌర్జన్యముతో నాశనము గావించి కేవలము కాయకష్టము చేయువారియొక్క నిరంకుశరాజ్యమును

(Proletariat dictatorship) స్థాపించినారు. ఇటులనే ప్రతి దేశములోను కాయకష్టము చేయువారి మధ్యను (Proletariat) ఇతరవర్గములన్నిటిమధ్యను నిరంతరము ద్వేషపూరితమైన పోరాటములు, దౌర్జన్యయుతమైన విప్లవములు జరిగి, కాయకష్టము చేయువారియొక్క నిరంకుశ రాజ్యము స్థాపనకావలెనని వారి ఆశయము. వారికి గృహపరిశ్రమలు ఖద్దరు గ్రామపరిశ్రమలు పనికిరావు. ప్రభుత్వమే పెద్దయంత్రశాలలను స్థాపించి వస్త్రములు మొదలగు సమస్తసరుకులను తయారు చేయించవలెను. భూములన్నియు ప్రభుత్వమువే. వర్తక వ్యాపారమంతయు ప్రభుత్వమే చేయవలెను. పాశ్చాత్యదేశములలో వలెనే సోవియటు రష్యాలోకూడ పారిశ్రామిక యంత్రశాలల చుట్టు గొప్పపట్టణములు పెరిగినవి. పల్లెటూళ్లు క్షీణించినవి. వస్త్రములు మొదలగు మానవావసరము లన్నియు పట్టణములనుండి గ్రామములకు రావలసి వచ్చును. ఇంతేగాక దేశములోని స్త్రీపురుషు లందరును సొంతపొలములుగాని సొంత పరిశ్రమలుగాని సొంతవర్తకముగాని లేక ప్రభుత్వయంత్రశాలలలోను, ప్రభుత్వమునకు చెందినట్టిగాని పెద్ద ప్రజాసంఘములకు ప్రభుత్వము వప్పగింత చేసినట్టిగాని, గొప్ప వ్యవసాయ ఖండములలోను, మజూరీకి పనిచేసి జీవించవలెనని వారి కార్యక్రమము. అటుల రుష్యాలో చేసినారు. ప్రథమమున 1919 రాజ్యాంగవిధానములో 'ప్రతివారును శక్తికొలది పనిచేయవలెను. తన జీవనమునకు అవసరమైనంత మజూరిని పొందవలెను' అని పెట్టగా పనిచేయుట తక్కువై తినుట ఎక్కువైనది. చేతనైనవారుకూడ పనిచేయుట మానినారు. అందు

వలన 1936 విధానములో ఎవరెంత పనిచేసిన అంత మజూరి యివ్వబడు నను మార్పును చేసినారు. వారి నాగరికతకు కుటుంబము (Social unit) పునాదిసంస్థ కాదు. వ్యక్తులే పునాది. స్త్రీలు పురుషులు ఎవరంతటవారు బ్రతుకుదురు గావున వివాహము కంట్రాక్టు అయియున్నది. గాని మతధర్మము కాదు. వారి సంతానమునకు వారసత్వపు హక్కు లేదు. వారు జాతీయతత్వమునకు వ్యతిరేకులై అంతర్జాతీయవాదులై యున్నారు. చైనా దేశమునకు కమ్యూనిజం పనికిరాదని చైనాజాతీయ ఏకైకనాయకుడగు డాక్టరు సన్ యెట్ సేను ప్రకటించి యున్నాడు. భారతజాతికి కూడ కమ్యూనిజం పనికిరాదు. కమ్యూనిజంతో అవసరముకూడ లేదు. కమ్యూనిజం చిన్న మొక్క. దినదినమునకు మార్పులు చెందుచున్నది. భారతీయ చైనా నాగరికతలు అనేక పోటీలకాగి దృఢముగా నాటుకొని అనేక శతాబ్దములనుండి వ్యాపించిన గొప్ప వటవృక్షములు.

7. సర్వేజనా స్సుఖినోభవంతు, ధనముకన్న ధర్మము ఎక్కువది, అను ఆధ్యాత్మిక ధర్మములను పునాదిగాగల భరతవర్షము చైనా దేశములలో, పురపాలనానిర్మాణము, విజ్ఞానము, వర్తకవ్యాపారములు, పరిశ్రమలు, కళలు, శిల్పచాతురిని ప్రదర్శించు ఆలయములు, సౌధములు, ఉద్యానవనములు, మొదలగు వానితో విరాజిల్లుచు ఐశ్వర్యముతో తులతూగుచుండిన అందమైన గొప్ప పట్టణము లుండినను, ఆ రెండు దేశముల నాగరికతలకు గాఢమైన యుపస్తంభములు, ప్రధాన బలము, గ్రామములు, గ్రామ సంఘములు (Village Communities), గ్రామ పంచాయితీలు, వ్యవసాయము, తోటలు

పెంచుట, పశుసమృద్ధి, గ్రామపరిశ్రమలు, ఖద్దరు, గృహపరి శ్రమలు, చిన్నపరిశ్రమలు అయియుండెను. జాతీయధన పంపిణి న్యాయముగ జరుగుచుండెను. ఈ నాగరికతలకు కుటుంబము పునాది సంస్థ. వ్యక్తికాదు. వివాహము మతధర్మము. అది కంట్రాక్టుకాదు. ఇంటినుంచి స్త్రీలు కూలికి బయటికి వెళ్ళకుండగనే వారికికూడ తగినపని కల్పించి గృహపరిశ్రమలు పోషణచేయగలవు. స్త్రీలు తమపిల్లలను తామే మాతృప్రేమతో స్వయముగా పెంచుటకును సతీధర్మమును, మాతృధర్మమును చక్కగా నెరవేర్చుచు నీతిని కుటుంబసుఖమును కాపాడుకొనుటకును ఇదియే మార్గము. ఇదియే గృహస్థాశ్రమ ధర్మము. సోవియటు రష్యాలో అందరు స్త్రీలు మజూరీకి పోవలసియుండురు. గావున తమ పిల్లల పెంపకమును ప్రభుత్వనియమితులగు దాదుల చేతులలో వదలివేయవలసియుండును. ఇది అస్వాభావికమైన పద్ధతి. గృహస్థాశ్రమ ధర్మమునకు వ్యతిరేకము. ఈ రెండునాగరికతలు (భారతీయ చైనా నాగరికతలు) గ్రామనాగరికతలు. ఏగ్రామములోను అన్నవస్త్రములకు కొదవలేదు. అన్ని వృత్తులును ప్రబలియుండెను. విదేశసరుకులపోటీ లేనేలేదు. అందరికిని సుఖమైన జీవనోపాధి కలిగియుండెను. అన్నివిద్యలును, కళలును, శిల్పమును వర్ధిల్లెను. భూమి రయితుది. గ్రామములోని బంజర్లు, అడవులు, జలాశయములు, పోరంబోకలు మొదలగున వన్నియు గ్రామసంఘమునకు (Village community) చెందెను. రయితువద్దనుండి మితమైన శిస్తును మాత్రము ప్రభుత్వము వసూలు చేసెను. ఎక్కువ చేయుటకు వీలులేదు. గ్రామవ్యవహారములను గ్రామ పంచాయితీ

పరిష్కరించెను. ప్రతి గ్రామము దేశముయొక్క ఐశ్వర్యమును ధర్మమును విజ్ఞానమును నాగరికతను కాపాడుచుండెను. ప్రతి గ్రామ మొక ప్రజాస్వామ్యముగ (Republic) నుండెనని జస్టిసు ఫీల్డింగు వ్రాసినాడు. మన దేశములో ప్రభుత్వధర్మములను నిర్వర్తించిన రాజులు పెద్దరాజులైనను చిన్నరాజులైననుఉండిరే గానిప్రభుత్వమునకును రయితులకును మధ్య(భూఖామందులగు) జమీందార్లజాతి లేదు. జమీందారి పద్ధతి మన దేశనాగరిక తలో భాగముకాదు. రయితుల యొక్కయు గ్రామసంఘముల యొక్కయు అనాదిసిద్ధమైన హక్కుల నపహరించిన ప్రస్తుత జమీందారి పద్ధతిని ఈస్టిండియా కంపెనీ కాలములో వారన్ హేస్టింగ్సు, కారన్ వాలీసు ప్రభువులు మన దేశములో స్థాపించి యున్నారు. వారు దీనిని ఇంగ్లాండులోని భూఖామందు పద్ధతిన (Land-lordism) హిందూదేశమున స్థాపించినారని బెరిడిల్ కీతు తన హిందూదేశ రాజ్యాంగ చరిత్రలో వ్రాసి యున్నాడు. రయితులకును గ్రామసంఘములకును అనాదిసిద్ధముగానుండిన హక్కుల నన్నింటిని పునరుద్ధరించుటకు భారత జాతీయవాదులు బద్ధకంకణులై యున్నారు. పాశ్చాత్య నాగరికత భరతవర్షము చైనా దేశములలో వ్యాపించినకొలది యు విదేశ పారిశ్రామికసరుకులు దిగుమతి యగుటయేగాక పాశ్చాత్య దేశములలో వలెనే విదేశ స్వదేశ షాహుకార్లచే గొప్ప పారిశ్రామిక యంత్రశాలలు స్థాపించబడి ధనికవర్గము అనగా షాహుకారుజాతి ఏర్పడుచున్నది. పట్టణములు వృద్ధి యగుచు వాటి ప్రాముఖ్య మెక్కువగుచున్నది. ఆ దేశముల లోని ధనికవర్గ - కార్మికసమస్యలు ఈ రెండు దేశములలో

నుదయించుచున్నవి. ఖద్దరు, గ్రామపరిశ్రమలు, గృహపరిశ్రమలు, చిన్నపరిశ్రమలు పునరుద్ధరణము కాబడకుండ నీ యంత్రశాలలుఅడ్డురాగలవు. కావున పరిస్థితులింకను విషమించక ముందే దేశములో ధనికవర్గమును వృద్ధికాకుండ అరికట్టవలె ననియు, న్యాయముగా జాతీయధనము పంపిణి గావలెననియు, జాతీయధనాభివృద్ధికి ఖద్దరును, గ్రామ పరిశ్రమలను, గృహ పరిశ్రమలను, చిన్నపరిశ్రమలను, పునరుద్ధరించుటయే అత్యావ సరమనియు, తప్పనిసరిగా యంత్రములతోనే సాగించవలసిన పెద్దపరిశ్రమలను, పెద్దబ్యాంకులను, గనులను, రైళ్ళను, స్టీమరులు విద్యుచ్ఛక్తి మొదలగువాటిని ప్రజాప్రభుత్వమే నడపవలెననియు భారతీయ చైనాజాతీయనాయకులుప్రకటించియున్నారు. ఇందు కొరకే మహాత్మాగాంధి అఖిలభారతచర్ఖాసంఘమును అఖిల భారత గ్రామపరిశ్రమలసంఘమును స్థాపించియున్నారు. 1931లో జరిగిన కరాచికాంగ్రెసుయొక్క తీర్మానమును, భారతీయ ఆర్థికప్రణాళిక (National Planning) కమిటీయొక్క కార్యక్రమ మును, డాక్టరు సన్ యెటుసేను యొక్క గ్రంథములను, చైనా క్యూమింటాంగు తీర్మానములను చదివినచో నీ సంగతి స్పష్టము కాగలదు. ఖద్దరుకును, గ్రామపరిశ్రమలకును, గృహ పరిశ్రమలకును, చిన్నపరిశ్రమలకును, విదేశసరకులయొక్కయు మిల్లుసరుకులయొక్కయు పోటీ తగులకుండ కాపాడుట ప్రభు త్వముయొక్క విధ్యుక్తధర్మమై యున్నది. ఇట్టి కార్యక్రమము వలననే కుటుంబములయొక్కయు, గ్రామములయొక్కయు, ఆర్థిక సాంఘిక రాజకీయ స్వేచ్ఛ కాపాడబడి పాశ్చాత్య నాగరికతయొక్కయు రుష్యా నాగరికతయొక్కయు లోపములు

తొలగించబడుచున్నవి. ప్రకృతిశాస్త్రములు యంత్రములు మానవుల ఐహిక ఆధ్యాత్మిక అభివృద్ధికి సుఖమునకు పని ముట్లుగా చేసికొనతగినవే గాని వాటికి మానవులు దానులు కాగూడదు.

ఈ ఘోరయుద్ధము ముగియగనే, మరల యుద్ధములు స్వతంత్ర పోరాటములు సాంఘిక పోరాటములు కలుగకుండ, మానవజాతులలో స్నేహవాత్సల్యములు సోదరభావము శాశ్వతశాంతి స్థాపితమగుటకును, మానవాభివృద్ధి నిరాటంకముగను శాంతముగను జరుగుటకును, ప్రపంచ పునర్నిర్మాణ పనులు జరగవలెనను విషయమునుగూర్చి ధీమంతులగువారు చర్చించుటకు మొదలిడినారు. ఈ మహాత్కార్యము జయప్రదముగ నెరవేరుటకుగాను, తపస్సు, త్యాగము, అందరి యందును సమభావము, సత్యము, అహింస, (ఛాందోగ్య) మానవు లందరియందును ప్రేమ (బృహదారణ్యక) ఇతరులకు చెందిన దాని కొరకు ఎన్నడును ఆశించకుము (ఈశావాస్య) ధనముకన్న ధర్మమే ఎక్కువది (బృహదారణ్యక) మొదలగు ధర్మముల మీాద నిర్మింపబడిన భారతీయ చైనా నాగరికతా ఆధ్యాత్మికతత్వమే ప్రధానస్థానము నాక్రమించవలసి యున్నది; దానిని అన్ని దేశములును గుర్తించు దినములు త్వరలోనే రాగలవు.

8. కావున మానవజాతియొక్క శాశ్వతమైన శాంతికి అభివృద్ధికి, సర్వతోముఖమైన ఐహికాముష్మికప్రదమైన భారత జాతీయ నాగరికత స్వతంత్రము పునరుద్ధరించబడుట చాల అవసరమైయున్నది. మరియు భారతజాతియొక్క ఆధ్యా

త్మికతత్వమును ఇతరజాతులు అవలంబించవలసియున్నది. భారతజాతి వేలసంవత్సరములుగ అఖండత్యాగములచే కాపాడబడిన తన నాగరికతను వదలిపెట్టి విదేశనాగరికతల నవలంబించుటకు యత్నించినయెడల అది ఆత్మవినాశకరము. విదేశనాగరికత పట్టకపోగా ఉన్నదికూడ పోయి జాతి నశించును. "పదివేల సంవత్సరములనుండి దిట్టముగా నాటియున్న ఆధ్యాత్మిక నాగరికతను విసర్జించి నూతననాగరికతను నేర్చుకొన ప్రయత్నించుటవలన భారతజాతి నాశనమగునే గాని నూతన నాగరికత పట్టదు. కొండలలో పుట్టి వెయ్యిమైళ్ళ దూరము తూర్పుగా సాగిన నదీప్రవాహమును పశ్చిమముగా త్రిప్ప ప్రయత్నించుట అసాధ్యమైనపని. ఒకవేళ ఆ ప్రయత్నమువలన ఆ ప్రవాహ మెండిపోవునేమోగాని పశ్చిమముగా మాత్రము తిరగదు"అని శ్రీ వివేకానంద స్వాముల వారు చెప్పియున్నారు. కావున భారతజాతి విదేశములనుండి మంచివిషయములను నేర్చుకొని తన కార్యక్రమములో చేర్చుకొనవలెనే గాని విదేశనాగరికతలయొక్క వ్యామోహము అనుకరణము బొత్తుగా పనికిరాదు. ముఖ్యముగా అమెరికా ఇంగ్లాండులవలె మనము (Democracy) ప్రజారాజ్యమును, ప్రకృతి శాస్త్రజ్ఞానాభివృద్ధిని అవలంబించవచ్చును. సోవియటు రుష్యాలో జనసామాన్యముకొరకు గావించిన అభివృద్ధికరమైన కార్యక్రమములను మనజాతి కనుగుణ్యముగ మార్చి యవలంబించ వచ్చును. కాని "స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః"అను భగవద్గీతా వాక్యము మనజాతీయ ధర్మమైయున్నది. భారత జాతీయ జీవన పునరుద్ధరణమునకు

ఉపనిషద్ధర్మములు విశేషముగ తోడ్పడగలవు. ఉపనిషత్తులు విశ్వమానవకోటికి వర్తించునవై, కులమతభేదములకును, చెడుసాంఘిక ఆచారములకును, ఎక్కువ తక్కువల అహంకార రోషములకును, ఎట్టి అవకాశము లేనివై యున్నవి. కావున ఉపనిషద్ధర్మముల ఆచరణముయొక్క పునరుద్ధరణములో హిందూమహమ్మదీయ క్రైస్తవ మతభేదము లంతరించి దేశములో సమానత్వము, సోదరత్వము, ఐకమత్యము కలుగ గలదు. ఉపనిషద్ధర్మము లనెడి గంగానదీ ప్రవాహముతో, ఇస్లాముయొక్క ఏకేశ్వరోపాసనము సోదరత్వము, క్రైస్తవ మతముయొక్క త్యాగప్రేమతత్వములు, యమునా సరస్వతులవలె సమ్మేళనమై నవ్యభారత జాతీయ జీవనవాహినిగా ప్రవహించగలదు. భారతప్రజలలో నూతన జీవము కలిగి, నిస్సహాయతకు బదులు ఆత్మవిశ్వాసము, ఆత్మశక్తి, ఆత్మ స్వాతంత్ర్యములు, ధైర్యస్థైర్యములు, చురుకుదనము, సోదర భావము, ఐకమత్యము, దైవభక్తి, పారమార్థిక చింతనము, అహింసాసత్యములు, స్వార్థత్యాగము, మానవ సేవానురక్తి, దేశోద్ధరణాసక్తి, మొదలగు సద్గుణములు కలిగి తమ జాతిని సర్వవిధముల నుద్ధరించుకొనుటకు శక్తిమంతులగుదురు. మానవజాతియొక్క నాగరికతా పుష్పవనమునకు మరల భారతీయ చైనా నాగరికతా పుష్పములు నూతన సౌరభమును శోభను కలుగజేయగలవు.

9. మన జాతీయ జీవనమునకు జాతీయ నాగరికతకు పునాది అత్యుత్కృష్టమైన ఉపనిషత్తులని ప్రతిభారతీయు ను

గర్వపడవలెను. ఉపనిషద్ధర్మముల యాచరణము మానవులకు మోక్షము నిచ్చును. దేశమునుద్ధరించును. మానవకోటిని తరింపచేయును. అట్టి ఉపనిషత్తుల పఠనమునందు ముఖ్యముగా యువజనులకు అభిరుచిని శ్రద్ధను కలుగచేయు నుద్దేశముతో నీ గ్రంథము వ్రాసినాడను. నేను ఉపనిషత్తులను వ్రాయుటలో ఇంకను గొన్ని ఉపయుక్తమైన విషయములను చేర్చి "భారత దేశము మానవకోటి కిచ్చుచున్న సందేశ"మను పేరున ఇంక కొంచెము పెద్దగ్రంథమును వ్రాయవలె నని సంకల్పించితిని! కాని, నా అనారోగ్యము వలన అది సాగలేదు. దానికి కావల సిన గ్రంథపఠనముకూడ సాగలేదు. ఇంతలో నా మిత్రులైన డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారు తాము రచించుచున్న అత్యు త్కృష్టమైన "ఆయుర్వేదశిక్ష"యను గ్రంథములో మిగిలిన దర్శనములతో పాటు వేదాన్తదర్శన మగు ఉపనిషత్తు లేమి చెప్పుచున్నవో తెలుపుట కొరకు అనుబంధగ్రంథమును తమ కివ్వమని నన్ను కోరినందున నేనింతవరకు వ్రాసిన దానిని "ఉపనిషత్సారము"లను పేరున ప్రచురించుట కిచ్చితిని. ఇందులోని పాఠములు ఆరు (1) సత్యాన్వేష ణము, (2) సృష్టికికారణము, (3) పరమాత్మ, (4) జీవాత్మ, (5) పరమాత్మను పొందుట, (6) మానవ ధర్మములు అని వీటికి పేరు. వీటిని పఠించినచో ఉపనిషత్తుల బోధ లేమో, అవి ఎంత ఉత్కృష్టమైనవో విద్యార్థులకును సామాన్యజనులకును తెలియగలవు. ఆ యా పాఠములు తెలిపెడి విషయములను బోధించుటకై ఏకాదశోపనిషత్తులలోని మంత్రములనే ఎత్తి వ్రాసితిని. ప్రతిమంత్రము క్రిందను తెలుగు అర్థమును

ఇంగ్లీషు అర్థమును వ్రాసితిని. కొన్నింటిక్రింద కొంచెము వివ్రలముగ తెలుపు షరాలను కూడ వ్రాసితిని. అసలు మంత్రములు మహాపురుషుల అనుభవములు. వాటి అర్థము తెలిసికొని వాటిని శ్రద్ధతోను, గౌరవముతోను, ప్రతిదినము పఠించినను, మననముచేసినను గొప్ప ఆత్మవికాసము కలుగుననుట నిస్సంశయము. ఆ యుద్దేశ్యముతోడనే అసలు మంత్రములివ్వబడినవి. ఉపనిషత్తుల కాలములో నుండిన స్త్రీల ఉన్నత స్థితిని గూర్చియు, చతుర్వర్ణములను గూర్చియు, రెండు అనుబంధములు కూడ చేర్చితిని. కొంత ఉపోద్ఘాతము కూడ వ్రాసితిని. ఈ పుస్తకము వలన కొంచెమైనను లాభముకలదని ఎంచబడినచో నేను సంకల్పించిన అసలు గ్రంథమును ఎప్పటికైనను వ్రాసి ఆంధ్రమహాజనులకు సమర్పించుకొనెదను.

బ్రహ్మజ్ఞానియైన శ్రీవినోబాభావేగారు నాకు దయతో వ్రాసియిచ్చిన అమూల్యమైన తొలిపలుకును కూడ ఈ గ్రంథమునందే చేర్చితిని. వారిం చే సంతయు కృతజ్ఞుడను.

శాంతి కుటీరము,
నందిగామ.

అయ్యదేవర కాళేశ్వరరావు.

# విషయసూచిక

2

# శాంతి మంత్రము

శాంతి ఓం

అసతో మా సద్గమయ
తమసో మా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతం గమయ

బృహదారణ్యక. 1 అ. 3 బ్రా 28 మం.

ఓ పరమేశ్వరా! నన్ను అసత్యమునుండి సత్యమునకు, అంధకారము (అజ్ఞానము) నుండి వెలుతురు (జ్ఞానము) లోనికి, మరణమునుండి శాశ్వతానందమయ జీవనమునకు గొనిపొమ్ము.

O Lord, Lead me from Untruth to Truth,
From ignorance to Knowledge and
From death to Eternal Bliss.

# ఉపనిషత్పాఠములు

## మొదటి పాఠము

### సత్యాన్వేషణము

### (The search for Truth)

హరిః ఓం.

1. బ్రహ్మవాదినో వదన్తి
కిం కారణం బ్రహ్మ కుతః స్మ జాతాః
జీవామ కేన క్వచ సంప్రతిష్ఠా
అధిష్ఠితాః కేన సుఖేతరేషు
వర్తామహే బ్రహ్మవిదో వ్యవస్థామ్.

శ్వేతాశ్వతరోపనిషత్. ప్రథమాధ్యాయః 1.

సత్యాన్వేషులగువారు కొందరు గూడి తమలోతాము ఇటుల చర్చించిరి. ఈమహాసృష్టికి కారణమేమి? ఎచటనుండి ఎందుకు మనము పుట్టినాము? దేనివలన మనము బ్రతుకుచున్నాము? తుదకు మనకు విశ్రాంతిస్థల మెక్కడ? మన సుఖదుఃఖములన్నియు ఎవరివలన, లేక దేనివలన నిర్ణయింపబడుచున్నవి? ఏ శాసనములు మనలను నడపుచున్నవి? పరబ్రహ్మమని చెప్పుదురే, అది ఎట్టిది?

Seekers of truth discuss among themselves–what is the cause of this creation? Whence are we born? Why do we live? Where is our final rest? Under whose or what laws are we subject to happiness and misery? What laws are controlling us? Some say, it is Parabrahma. Is it the cause? What is its nature?

[షరా:— మన చుట్టునున్న విశ్వము అనంతముగ నున్నది. ఈ విశ్వమునందు మానవుడు అణువువలె నున్నాడు.

కాలము అనంతమైనది. దీనిలో ఏ మనుజుడును నూరు సంవత్స రములకన్న జీవించుటలేదు. జన్మించిన ప్రతిమనుజునికిని జీవ జంతువునకును మరణము తప్పదు. గనుక ఈ అద్భుతమైన అనంతమైన మహాసృష్టికి కారణమేమి? మానవు డెటుల పుట్టి జీవించుచున్నాడు? మరణించిన పిమ్మట స్థితి ఏమి? మొదలైన పై సత్యాన్వేషుల ప్రశ్నలే ఆలోచనకలవారందరును వేసికొని యున్నారు. ఈ ప్రశ్నలకు సహేతుకమైన సత్యమైన జవాబు లను ఇచ్చునవే ఉపనిషత్తులు.]

2. కాలః స్వభావో నియతి ర్యదృచ్ఛా
భూతాని యోనిః పురుష ఇతి చిన్త్యా
సంయోగ ఏషాం నత్వాత్మభావా
దాత్మాప్యనీశః సుఖదుఃఖహేతోః॥

శ్వేతాశ్వతర. ప్రథమ. 2.

కాలము, స్వభావము, శాసనము, అదృష్టము, జడ పదార్థము, భౌతికశక్తి, తెలివి - ఇవిగాని, వీటియొక్క కల యికగాని ఈ మహాసృష్టికి కారణము కాదు. పైన చెప్ప బడిన ప్రతిదానియొక్క స్వభావమును బట్టియు, పుట్టుకను బట్టియు సృష్టికి కారణము కాగల అర్హత దానికి లేదు. మనుష్యునిలోనున్న జీవాత్మకూడ సుఖదుఃఖములకు లోనై యుండి స్వతంత్రము లేనిదై యున్నందున సృష్టినిజేయు సమ ర్థత కలదికాదు, అని వారు నిర్ణయించిరి.

They came to the conclusion that Time, Nature, Law, Chance, Matter, Energy, Intelligence–neither these nor a combination of these can bear examination, because of their own nature and origin. The self (Individual Self) also is not

fit to be the cause of the creation, itself not being a free agent and being under the sway of happiness and misery.

3. తే ధ్యానయోగానుగతా అపశ్యన్
దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢామ్
యః కారణాని నిఖిలాని తాని
కాలాత్మయుక్తా న్యధితిష్ఠ త్యేకః॥

శ్వేతాశ్వతర. ప్రథమ. 3.

(చర్చ సలిపి బాగుగా యోచించి తుదకు) ధ్యానయోగము గావించి మరియొక విధమున పూర్తిగ తెలియక దాగియుండెడి సత్యమును తమ ఆత్మశక్తివలన కనుగొనిరి. ఆ కనుగొనినది యేమనగా - అద్వితీయుడై జ్ఞానమునకు స్థానమై పైన చెప్పబడిన కాలము, స్వభావము, జీవాత్మ మొదలగు వాటి కన్నిటికి నియామకుడై యున్న పరమాత్మ ఈ సృష్టికి కారణమని కనుగొనిరి.

(After full discussion and consideration) they practised Dhyaanayoga (concentrated meditation) and discovered the truth, which could not be fully known by any other method, by self intuition and power of Self. They realised that it is Paramaathma, who is one without a second, who is the seat of intelligence and wisdom and who controls all the above mentioned causes beginning with time and ending with individual soul, that is the cause of this creation.

4 ఈ విధముగనే సుకేశనుడు, సత్యకామ, గార్గ్య, కౌసల్య, భార్గవ, కవంధిన్ అను సత్యాన్వేషులు బయలుదేరి జ్ఞానమును పొందుటకు పిప్పలాదఋషివద్దకు వచ్చి అడుగగా, ఆయన వారినందరిని మరి యొక సంవత్సరము బ్రహ్మచర్యవ్రత మనుష్ఠించి పిదప వారికి కావలసిన ప్రశ్నల నడగవచ్చునని

చెప్పెను. వా రటులనే మరియొక సంవత్సరము బ్రహ్మచర్య వ్రతమును చక్కగా ననుష్ఠించి, పిమ్మట ఆయనను సృష్టిని గూర్చియు, పరబ్రహ్మమును గూర్చియు ప్రశ్నల నడిగిరి. వా రడిగిన ప్రశ్నలును ఆ పిప్పలాదఋషి వారికి యిచ్చిన సమాధానములును, ప్రశ్నోపనిషత్తయి యున్నవి.

ప్రశ్న. ప్రథమ. 1-2.

Similarly Sukesan, Gaargya, Kowsalya, Bhaargava, and Kavandhin-all these devoted to the discovery of Truth approached the adorable Rishi Pippalada, and requested him to explain to them about the cause of creation and about Parabrahma. The Rishi asked all of them to pass another year of Brahmacharya and then ask any question which they liked. Accordingly they observed one year of Brahmacharya again and approached him with all their questions to find out the Truth. Their questions and his answers constitute the Prasnopanishad.

5. ఛాందోగ్యోపనిషత్తుయొక్క అష్టమ ప్రపాఠకములో దేవేంద్రుడు బ్రహ్మజ్ఞానమును పొందుటకై చతుర్ముఖబ్రహ్మవద్దకు పోయినట్లును చతుర్ముఖబ్రహ్మ మొదటి పర్యాయము 32 సంవత్సరములు బ్రహ్మచర్యవ్రతమును ఇంద్రునిచే అనుష్ఠింపజేసి కొంతభాగ ముపదేశించినట్లును, మరల 32 సవంత్సరములు బ్రహ్మచర్యవ్రత మనుష్ఠింపజేసి మరికొంతభాగ ముపదేశించినట్లును, మూడవ పర్యాయము 5 సంవత్సరములు ఇంద్రునిచేత బ్రహ్మచర్యవ్రత మనుష్ఠింప జేసి సాంతముగా బ్రహ్మవిద్యయొక్క రహస్యము నతనికి బోధించెననియు చెప్పబడియున్నది. ఇందువలన ఉపనిషత్తుల లోని సత్యములను ఎంత కష్టపడినమీదట, ఎంతకఠినమైన నియమములను జరిపి, ఆత్మశక్తిని విజృంభింప జేసినమీదట, కనుగొనిరో తేటతెల్ల మగుచున్నది.

6. [పై విధముననే నచికేతుడు యమధర్మరాజును ప్రశ్నించెను]

యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే
ఽస్తీత్యేకే నాయ మస్తీతి చైకే
ఏత ద్విద్యా మనుశిష్ట స్త్వయాఽహం
వరాణా మేష వర స్తృతీయః॥

కఠోపనిషత్, ప్రథమాధ్యాయం. ప్రథమవల్లి. 20

మనుష్యుడు మరణించిన పిదప అతని ఆత్మ (జీవాత్మ) చావకుండునని కొందరును, శరీరముతోనే అంతయు నశించును గాని వేరు ఆత్మ అనునది మిగిలియుండదని మరి కొందరును, చెప్పెదరు. ఈ సందేహనివృత్తి నాకు చేయవలసినది. నేను దీనిని తెలిసికొనగోరుచున్నాను. నీవు నాకిత్తు నన్న వరములలో ఇది ఆఖరు వరముగా భావించి నాకు ఈ విషయమైన సత్యమును బోధించుము, అని నచికేతుడు యమధర్మరాజు నడిగెను.

(Similarly Nachiketa asked Yama thus.)

When man dies, there is this doubt, Some say "He exists afterwards also". Some others say "He does not." This I desire to know, namely, whether his Soul continues to exist after the death of the body. Please instruct me about this. This is my final boon that you promised to grant me.

7. ఈ ప్రశ్న ఆలోచన గలవారందరును వేయు ప్రశ్నయే. ఇందుకు

"నిత్య శ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే"

కఠ. ప్రథమ. ద్వితీయ. 18

మనుష్యుని శరీరము చంపబడినను లోపలి జీవాత్మ చంపబడదు. ఆజీవాత్మ శరీరమును వదలిపోవుటయే శరీరము

నకు మరణము. జీవాత్మ ఎల్లప్పుడును ఉండునది, శాశ్వతమైనది, సనాతనమైనది, అని యమధర్మరాజు జవాబు చెప్పెను.

Yama replied as follows:—

Even when the body is destroyed, the Soul which is eternal, everlasting, and ancient does not die. Death only pertains to the body but not to the Jeevatma (individual Soul) within. When the Soul leaves the body, the body dies.

8. ఆత్మానగ్ం రథినం విద్ధి శరీరం రథమేవతు
బుద్ధింతు సారథిం విద్ధి, మనః ప్రగ్రహమేవచ.
కఠ. ప్ర. తృ. 3.

(ఈజీవయాత్ర చేయుటలో) శరీరము అను రథము మీాద జీవాత్మ అను రథికుడు ఎక్కి ఇంద్రియములనెడి గుఱ్ఱములను రథమునకు కట్టి తన మనస్సనెడి పగ్గముతో వాటిని లాగుచు తనబుద్ధి అనెడి సారథితో రథమును తోలించుచున్నాడు, అని తెలిసికొనవలెను (అని యమధర్మరాజు జవాబు చెప్పెను.)

Know that the (Jeevatma) soul is the master of the chariot and sits within it and that the body is the chariot (in the soul's pilgrimage of life). He uses his own intellect as the driver of the chariot and his own mind as the rein (that directs and controls the senses which are the horses of the chariot)

[వరా:— ఈ జీవాత్మనుగూర్చి విపులముగ 4 వ పాఠములో చెప్పెదము. సృష్టినిగూర్చి ఉపనిషత్తులు ఏమి చెప్పుచున్నవో తెలిసికొందము.]

# రెండవ పాఠము

## సృష్టికి కారణము

## (The cause of the creation)

హరిః ఓం

1. ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్ ।
నాన్యత్కించన మిషత్, స ఈక్షత లోకాన్నుసృజా ఇతి॥
[ఐతరేయోపనిషత్, ప్రథమ అధ్యాయము, ప్రథమఖండము. 1]
స ఇమాల్లోకా నసృజత [డిటో 2]

సృష్టికి పూర్వము ఇది యావత్తు ఒక్కడైన పరమాత్మలో నుండెను. ఆ పరమాత్మకన్న వేరేమియు లేకుండెను. ఆయన లోకములను సృష్టిచేయ సంకల్పించెను.

ఆయన ఈలోకములను అన్నిటిని సృష్టించెను.

Before creation, this whole was (in) Paramatma who was one without a second. There was nothing else. He desired to create the worlds.

He created all these worlds.

[వరా:—ఆకాశమున కనపడు అనేక సహస్ర సంఖ్యగల నక్షత్రము లన్నియు లోకములే. మన భూమిచుట్టు దిరుగుచున్న చంద్రుడు భూమికి రెండులక్షల ముప్పది తొమ్మిదివేల మైళ్ళదూరమున నున్నాడు. మన భూమి సంవత్సరమున కొకసారి దేనిచుట్టు దిరిగివచ్చుచున్నదో, ఆ సూర్యుడు (సూర్యగోళము) భూమికి తొమ్మిదికోట్ల యేబదిలక్షల మైళ్ళ దూరమున నున్నాడు. ఇవి మనకు చాల సమీపమున నున్న గోళములు. మనకు కనపడు నక్షత్రములు మనకు లెక్కపెట్ట నలవి

కానంత దూరమున నున్నవి. కొన్ని నక్షత్రములు సూర్యుని కన్న నూరు రెట్లు పెద్దవి. ఒక్కొక్క నక్షత్రముల గుంపు యొక్క వెలుతురు సూర్యుని వెలుతురుకన్న మూడులక్షల రెట్లున్నది. వాటిలో దేనినడక (గతు)లు దానికి గలవు. వేటి కిని ప్రత్యేక ఆధారములు లేకుండ ఆకాశములో నిలచి తమ తమ గతులను నిర్వర్తించుచున్నవి. ఇందువలన, ఈ మహా విశ్వము ఎంత అనంతమైనదో, దీనియొక్క సృష్టికర్త ఎట్టి అనంతశక్తి, అనంతజ్ఞానము కలవాడో మనకు గోచరించగలదు.]

2. అసద్వా - ఇదమగ్ర ఆసీత్, తతో వై సదజాయత, తదాత్మానగ్ం స్వయమకురుత.

తైత్తిరీయోపనిషత్. బ్రహ్మవల్లి. సప్తమ. 1

ఈ స్థూలరూపమగు చేతనాచేతనజగత్తు సృష్టికి పూర్వము అవ్యక్తముగ, అనగ నామరూపభేదములు లేక బ్రహ్మములో నుండెను. ఆ పరమాత్మనుండియే ఈ వ్యక్త మైన ప్రపంచము పుట్టెను. పరమాత్మ స్వయముగ తన నుండియే ఈ సృష్టిని చేసెను.

In the beginning this was non-Being i. e. without name and form. From Paramaatma verily this universe with mani. fold forms and names was born. Paramatma created all this from Himself.

3. స్వయంభూః......... ఈశావాస్య ఉపనిషత్ 8

ఆయనను ఎవరు సృష్టించలేదు. ఆయన స్వయంభువు

He is Self existant.

[వ్యా:— ఉపనిషత్తులకు శ్రీ వేదవ్యాసులవారి వ్యాఖ్యానమని చెప్పదగిన బ్రహ్మసూత్రములలో నిటులున్నవి:

'ఆత్మకృతేః పరిణామాత్.' బ్రహ్మసూత్రములు
1-4-26.

అనగ పరమాత్మ తానే సృష్టిగా మార్పును జెంది ఈ సృష్టిని చేసెను. (సృష్టిని చేసిన నిమిత్తకారణమే కాకుండ సృష్టికి ఉపాదానకారణము కూడ భగవంతుడే అయి యున్నాడు.)]

4. పూర్ణమదః పూర్ణమిదం, పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ, పూర్ణమేవావశిష్యతే.

బృహదారణ్యక. 5-1-1

పరమాత్మ అనంతమైనది. (సృష్టి) విశ్వము అనంతమైనది. అనంతమైన పరమాత్మలోనుండి అనంతమైన విశ్వము వచ్చినది. మిగిలినది కూడ అనంతమే.

Paramaatma is Infinite. The Universe is Infinite. From the infinite Paramaatma the Infinite Universe has emanated. What remains also is Infinite.

5. యథోర్ణనాభి స్సృజతే గృహ్ణతే చ
తథాక్షరా త్సమ్భవతీహ విశ్వం

ముణ్డకోపనిషత్, ప్రథమ ముండకం-ప్రథమ ఖండమ్. 8

ఏ ప్రకారముగా సాలెపురుగు తనలోపలనుండి తంతువులను (దారములను) సృజించుచున్నదో మరల వాటిని తన లోపలికి గుంజుకొనుచున్నదో, ఆవిధముగానే నాశరహితమైన పరమాత్మయందుండి ఈ నిఖిలజగత్తు పుట్టుచున్నది.

As the spider creates (projects) threads of silk from within itself and takes them back again unto itself, so from the imperishable Paramaatma, the Universe comes out.

6. తదేత త్సత్యం
యథా సుదీప్తా త్పావకా ద్విస్ఫులింగా
స్సహస్రశః ప్రభవన్తే సరూపాః
తథాఽక్షరా ద్వివిధా స్సోమ్య భావాః
ప్రజాయన్తే తత్రచైవాపియన్తి.

ముండక. ద్వితీయముండకము. ప్రథమఖండం. 1.

ఈ విషయము సత్యము ఏప్రకారము బాగుగా మండుచున్న అగ్నినుండి దానితో సమానరూపముగల నిప్పు రవ్వలు వేలకొలది పుట్టుచున్నవో ఆవిధముగానే నాశరహిత మైన పరమాత్మనుండి వివిధములగు జీవులు పుట్టుచున్నవి. మరల ఆ పరమాత్మనే చేరుచున్నవి.

This is the truth. As from a blazing fire thousands of sparks, similar to it in form spring out, so my young friend, manifold beings originate from the Imperishable Paramatma and they verily go back into Him again.

7. యతో వా ఇమాని భూతాని జాయన్తే
యేన జాతాని జీవన్తి
యత్ప్రయ న్త్యభిసంవిశన్తి
తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి.

తైత్తిరీయోపనిషత్. భృగువల్లి ప్ర. 1

ఈ భూతములన్నియు దేనినుండి పుట్టుచున్నవో, పుట్టి నవి దేనివలన జీవించుచున్నవో, లయమునుపొంది మరల దేనిని ప్రవేశించుచున్నవో దానినిగూర్చి తెలుసుకొనుము. అదియే పరబ్రహ్మము.

Seek to know that from which all beings here are born, having been born by which they remain alive and into which on departing they enter - That is Paramaatma.

8. సన్మూలా స్సోమ్యేమా స్సర్వాః ప్రజా
స్సదాయతనా స్సత్ప్రతిష్ఠాః.

ఛాందోగ్యోపనిషత్, షష్ఠ, అష్టమ 6

ఈ సమస్త చేతనాచేతనసృష్టి పరమాత్మయే కారణముగా గలది. ఆ పరమాత్మయే ఆధారముగా గలది. ఆ పరమాత్మయందే లయస్థితిగలది.

All this Universe has Paramaatma as its cause and support. It dissolves again unto Him.

9. ఏకోహి రుద్రో నద్వితీయాయ తస్థు
ర్య ఇమాంల్లోకా నీశత ఈశనీభిః
ప్రత్య ఙ్జనా స్తిష్ఠతి సఞ్చుకోచాన్తకాలే
సంసృజ్య విశ్వాభువనాని గోపాః.

శ్వేతాశ్వతర. 3 వ అధ్యాయం. 2

ఎవరైతే ఈ లోకములను తన సర్వశక్తిత్వమువలన సంరక్షించుచు నడపుచున్నాడో, అట్టి రుద్రుడు (పరమేశ్వరుడు) ఒక్కడే. అనగ అద్వితీయుడు. అట్టివాడు రెండవవా డెవడును లేడు. మానవులారా! మీలో ప్రతివాని హృదయమునందును ఆయన ఉన్నాడు. ఆయన ఈ సర్వలోకములను తనలోనుంచి బయటికి తీసి రక్షించుచు తుదకు వాటి నన్నింటిని మరల తనలోనికి గుంజుకొనును.

He who protects and controls the worlds by his own powers, He — Rudra (Supreme Soul) is indeed one only. There is no one beside him who can make Him the second. O! men! He is present inside the hearts of every one of you. After projecting and maintaining all the worlds, He again withdraws them unto Himself.

10. ఐతదాత్మ్య మిదగ్ సర్వం
తత్సత్యగ్ స ఆత్మా.

ఛాందోగ్య; షష్ఠ, అష్టమ 7

ఈ సమస్త జగత్తు ఆ పరమాత్మయే ఆత్మగా గలది. ఈ విషయము సత్యము. ఆ పరమాత్మ ఈ సర్వవిశ్వమునకు ఆత్మ.

The whole Universe has Paramaatma as its Soul. This is the Truth. Paramaatma is the Soul of all this Universe.

11. మాయాంతు ప్రకృతిం విద్యా న్మాయినంచ మహేశ్వరం
తస్యావయవభూతైస్తు వ్యాప్తం సర్వమిదం జగత్.

శ్వేతాశ్వతర. 4 అధ్యాయం. 10

మాయ అనునది ప్రకృతియే యని తెలుసుకొనుము. మాయకు ప్రభువు పరమేశ్వరుడే నని తెలిసికొనుము. ఆయనలో భాగమైన జీవసంఘముతో ఈ సృష్టి యావత్తు నిండి యున్నది.

Know then that Maaya is the same as Prakriti and know that the great God is its Lord. The whole creation is filled by Jeevas (Individual Souls) who are part of Him.

[వరా:— ఈ మహావిశ్వమునందు పరమేశ్వరుడు, అసంఖ్యాకములగు జీవాత్మలు, ప్రకృతి అనగా జడ ప్రపంచము అను మూడు తత్త్వములు కనబడుచున్నవి. ఈమూటి సంబంధమును తెలిసికొనుటయే జ్ఞానము. పై మంత్రముల అర్థ మేమనగా, ప్రకృతి జీవాత్మలు కలిసిన విశ్వమునకు పరమేశ్వరుడు ఆత్మగా నున్నాడు. ప్రకృతి జీవాత్మలు కలిసిన విశ్వము పరమేశ్వరునికి శరీరముగ నున్నది. మానవశరీరమునకు జీవాత్మ

ఎటుల ఆత్మగా నున్నాడో, అటులనే ప్రకృతిజీవులు కలిసిన విశ్వమునకు పరమాత్మ ఆత్మగా నున్నాడు. పరమాత్మ ఈ విశ్వములోని ప్రతిభాగమునందును వ్యాపించియుండి మానవుని హృదయములోకూడ నున్నాడు. ప్రకృతికి మాయ యనికూడ పేరు. జగత్తుయొక్క సృష్టి, మరల దాని లయము మరల సృష్టి, మరల లయము, ఎల్లప్పుడును జరుగుచునే యుండును.]

12. య ఏకో జాలవా నీశత ఈశనీభిః
సర్వాం ల్లోకా నీశత ఈశనీభిః
య ఏవైక ఉద్భవే సంభవే చ
య ఏతద్ విదు రమృతా స్తే భవన్తి.

శ్వేతాశ్వతర. 3 వ అధ్యాయం. 1.

ఆయన సృష్టిలయకాలములయందు ఒక్కడుగనే యుండును. తనయొక్క అనిర్వచనీయమైన శక్తివలన ఈ సృష్టి కంతకును ప్రభువుగ నున్నాడు. ఆయనయే ఈలోకముల నన్నిటిని రక్షించుచు వాటిలో పని చేయుచున్న శక్తుల నన్నిటిని, శాసనముల నన్నింటిని నడుపుచున్నాడు. ఆయనను తెలిసికొన్నవారు అమృతత్వమును పొందుదురు.

It is the self same one, who exists alone at the time of creation and dissolution of the Universe, and who assumes mainfold powers and appears as the Divine Lord by virtue of His inscrutable power. He it is that protects all the worlds and controls all the various forces working therein. Those who realise this Being become immortal.



## మూడవ పాఠము

## పరమాత్మ (God)

### i

### సర్వవ్యాపి (Omnipresent)

1. ఈశావాస్య మిదగ్ం సర్వం
యత్కిఞ్చ జగత్యాం జగత్. ఈశావాస్య. 1

ఈ మారిపోవుచుండెడి సర్వజగత్తు, దానికి నియామకుడును ప్రభువును అయిన ఈశ్వరునిచేత వ్యాపించబడియున్నది. జగత్తుయొక్క ప్రతి చిన్నభాగముకూడ ఆయనచే వ్యాపించబడి యున్నది.

This whole changing universe is pervaded by Eswara who is its Lord and controller, and every small part of it is pervaded by Him.

2. తద న్తరస్య సర్వస్య, తదు సర్వస్యాస్య బాహ్యతః
ఈశావాస్య. 5

ఈశ్వరుడు ఈ సమస్తజగత్తునకును లోపలను వెలుపలను వ్యాపించి యున్నాడు.

Eswara pervades both inside as well as outside the creation.

3. బ్రహ్మైవేద మమృతం పురస్తా
ద్బ్రహ్మ పశ్చా ద్బ్రహ్మ దక్షిణత శ్చోత్తరేణ
అధశ్చోర్ధ్వం చ ప్రసృతం
బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠం. ముణ్డక ద్వి. ద్వి. 12

Verily all this is Immortal Brahman. He is in front of us, behind us, on our right side, on our left side, below us and above us. He exists everywhere. The Supreme Lord pervardes this whole universe.

నాశరహితమగు పరమాత్మ మనకు ఎదురుగాను, వెనుకను, కుడిప్రక్కను, ఎడమప్రక్కను, క్రిందివైపునను పైవైపునను అన్నివైపులను వ్యాపించియున్నది. ఈజగత్తు సర్వమును పరమాత్మ మయమై యున్నది.

ii

మానవుని హృదయములోగూడ నున్నాడు.

He also exists in the heart of man.

4. ఏకోవశీ సర్వభూతాన్తరాత్మా
ఏకం రూపం బహుధా యః కరోతి
త మాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా
స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషాం.

కఠ. ద్వి. ద్వి. 12

అనమానుడును సర్వజగత్తును తన అధికారముక్రింద (వశమందు) గలవాడును, సర్వభూతములకును అంతరాత్మగా నున్నవాడును అగు ఏ పరమాత్మ ఒక్కరూపమును అనేక నామరూపభేదములు గలదానినిగా చేయుచున్నాడో, అట్టి పరమాత్మను తమ ఆత్మయందు వసించుచున్నటుల చూచెడి జ్ఞానులకు శాశ్వతసుఖము కలదు. ఇతరులకు కలుగదు.

The one without the second, the ruler of the universe, the soul of the creation, who makes his one form mainfold— Him the wise men (devotees) percieve as indwelling In their own selves (souls) and to them belongs eternal happiness (bliss) and to none else.

5. నిత్యోఽనిత్యానాం చేతనశ్చేతనానా
మేకో బహూనాం యో విదధాతి కామాన్

తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా
స్తేషాం శాన్తి శ్శాశ్వతీ నేతరేషామ్.

కఠ. ద్వి. ద్వి. 13.

శాశ్వతుడును జ్ఞానమునకు స్థానమును ఒక్కడును అగు పరమేశ్వరుడే అందరియొక్క (న్యాయమైన) కోరికలను తీర్చు చున్నాడు. ఆయనను తమ ఆత్మలయందు వసించుచున్నటుల ఏభక్తులు చూచుచున్నారో వారికే శాంతికలుగును. ఇతరులకు కలుగదు.

He, the one enternal Being and the seat of Intelligence, who though one fulfils the (proper) desires of all - Him the wise men (devotees) perceive as indwelling in their own selves (Souls) and to them belongs eternal peace and to none else.

6. అవి సన్నిహితం గుహాచరం
నామ మహత్పదం

ముణ్డక. ద్వి. ద్వి. 1

ఆ పరబ్రహ్మము యోగులకు (భక్తులకు) ప్రత్యక్షమైనది. హృదయగుహాయం దున్నదగుటచే మిక్కిలి సమీపమున నున్నది. సుప్రసిద్ధమై మహత్తరమైనది. సర్వమున కాధారమైనది.

Parabrahma is realised by (Yogis) devotees. He is very close, being in the cavity of the heart of men. He is glorious and is the support of the universe.

[పరా:—"ఈశ్వరుని ఆరాధించుటకు మక్కాకుకాని కాశికిగాని యేల పోవలెను. నీహృదయగుహాయందుండు వానినే నీవు ఆరాధించుము'' అని భక్తాగ్రేసరుడగు కబీరు బోధించి హిందూముసల్మానుభేదములు కల్పితములని ప్రక

టించెను. ప్రతివాని హృదయగుహాయందును ఈశ్వరు డున్నందున మానవులలో నెక్కువవారని, తక్కువవారని భేదము లుండజాలవు. సమస్త మానవులును సమానులు, సోద రులు]

iii

విజ్ఞానఘనుడు (Intelligence)

7. ఏవం వా అరఇదం మహద్భూత మనన్త
మపారం విజ్ఞానఘన ఏవ.

బృహదారణ్యక. 2-4-12.

ఈ మహా అపారమైన అనంతమైన సత్యస్వరూపుడు విజ్ఞానఘనుడై యున్నాడు.

This great endless Infinite Reality is but pure Intelligence

సర్వజ్ఞుడు (Omniscient)

8. ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషోఽన్తర్యామ్యేష
యోనిః సర్వస్య ప్రభవాప్యయౌహి భూతానాం.

మాండూక్య. 6

ఈ పరమేశ్వరుడే సర్వమునకు నియామకుడు. ఇతడే సర్వజ్ఞుడు, సర్వము తెలిసినవాడు. ఇతడు యావత్తు విశ్వము నందు వ్యాపించి యున్నాడు. సర్వజగత్తునకు ఉత్పత్తిస్థానము. సర్వభూతముల సృష్టికిని, లయమునకును కారకుడు.

This is the Lord and controller of all. He is omniscient and knows everything. He pervades the whole uuiverse and is its source. He is the cause of the creation and its dissolution.

## iv

## అశరీరుడు (Formless)

9. అశరీరం శరీరే, ష్వనవస్థే ష్వవస్థితమ్
మహాన్తం విభు మాత్మానం, మత్వాధీరో నశోచతి.

కఠ. ప్ర. ద్వి. 22

పరమాత్మను శరీరము లేనివానిగను అనిత్యములగు అన్నిశరీరములందును ఉన్నవానిగను అతి గొప్పవానిగను సర్వ వ్యాపిగను తెలిసికొన్నజ్ఞాని దుఃఖమును పొందనేరడు.

That wise man will not have any grief who realises Paramaatma as bodiless but existing in all bodies, which are impermanent, and as supreme and all pervading.

10. అచక్షుశ్శ్రోత్రం తదపాణి పాదం
నిత్యం విభు సర్వగతం.

ముండక. ప్ర. ప్ర. 6.

పరమాత్మ కన్నులు, చెవులు, కాళ్లు, చేతులు లేనిది శాశ్వతమైనది. అన్నిచోట్ల నున్నది సర్వత్ర వ్యాపించియున్నది.

Paramaatma has neither eyes nor ears nor feet nor hands. He is eternal and pervading everywhere.

## v

## శాసనకర్త (Law giver)

1. భీషాఽస్మా ద్వాతః పవతే భీషోదేతి
సూర్యః భీషాఽస్మాదగ్ని శ్చేన్ద్రశ్చ
మృత్యుర్ధావతి పఞ్చమఇతి.

తైత్తిరీయ. బ్రహ్మా. అష్ట. 1

ఈ పరమాత్మయొక్క భయముచేత వాయువు వీచు చున్నది. ఆయన భయముచేతనే సూర్యు డుదయించు

చున్నాడు. ఆయన భయము చేతనే అగ్ని మండుచున్నది. వర్షము కురియుచున్నది. ఆయన భయముచేతనే అయిదవ దగు మృత్యువు తన మారణవిధులను వేగముగా నిర్వర్తించు చున్నది.

Out of fear for Him, the wind blows, through fear of Him the sun rises, through fear of Him Agni (Fire) and Indra (rain) and Death the fifth, speed in their duties.

12. ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే గార్గి
సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః
ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే గార్గి
ద్యావా పృథివ్యౌ విధృతే తిష్ఠతః.
ఏతస్యవా అక్షరస్య ప్రశాసనేగార్గి నిమేషా ముహూర్తా
అహోరాత్రా ణ్యర్థమాసా మాసా ఋతవః
సంవత్సరా ఇతి విధృతా స్తిష్ఠన్తి.
ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే గార్గి ప్రాచ్యోఽన్యా
నద్యః స్యన్దన్తే శ్వేతేభ్యః పర్వతేభ్యః
ప్రతీచోఽన్యాః యాంయాంచ దిశమను.

బృహదారణ్యక. అ. 3-8-9.

ఓగార్గి! అక్షరుడైన పరమాత్మయొక్క ప్రచండమైన శాసనము వలననే సూర్యుడు, చంద్రుడు తమ తమ స్థానము లలో నున్నారు; ఓగార్గి! అక్షరుడైన పరమాత్మ యొక్క ప్రచండమైన శాసనము వలననే ఆకసము, భూమి తమ స్థాన ములలో నుంచి పడిపోకుండ నిలచియున్నవి; ఓగార్గీ! అక్షరు డైన పరమాత్మయొక్క ప్రచండమైన శాసనమువలననే, నిమిషములు, ముహూర్తములు, రాత్రింబగళ్ళు, పక్షములు,

మాసములు, ఋతువులు, సంవత్సరములు వరుస తప్పకుండ తమ తమ కాలములందే వచ్చుచున్నవి; ఓగార్గి! అక్షరుడైన పరమాత్మయొక్క పరిచండమైన శాసనము వలననే కొన్ని నదులు, శ్వేతపర్వతములనుండి తూర్పుగా ప్రవహించుచున్నవి. మరి కొన్ని నదులు పశ్చిమముగా ప్రవహించుచు అటులనే పోవుచున్నవి. ఇతరనదులు తమ పోకడలలో ఆగకున్నవి.

Under the Mighty Law of this Immutable (Parama purusha) O Gargi! the Sun and Moon are held in their positions; under the Mighty Law of this Immutable, O Gargi! Heaven and Earth maintain their positions; under the inexorable Law of this Paramapurusha, O Gargi! Moments, Muhurtams, days and nights, fortnights, months, seasons and years are held in their respective places; under the inexorable Law of the Immutable, O Gargi! some rivers flow eastward from the white mountains, others flowing westward continue in that direction and still others keep to their respective courses.

13. యతశ్చోదేతి సూర్యో
అస్తం యత్ర చ గచ్ఛతి
తం దేవా స్సర్వేఽర్పితా
స్తదు నాత్యేతి కశ్చన; ఏతద్వై తత్.

కఠ. ద్వి. ప్ర. 9.

సూర్యుడెవనివలన ఉదయించుచున్నాడో ఎవనివలన అస్తమించుచున్నాడో, ఎవనికి సమస్త దేవతలును అధీనులై యున్నారో, ఎవనిని ఎవ్వరును అతిక్రమించలేరో, ఆయనయే పరబ్రహ్మము.

Under whose law the Sun rises and sets, under whose control all the Gods are, and who has no equal—That is Parabrahma.

## vi

### తేజస్సునకు స్థానము

### Source of Light

14. న తత్ర సూర్యో భాతి న చన్ద్రతారకం
నేమా విద్యుతో భాన్తి కుతోఽయ మగ్నిః
త మేవ భాన్త మనుభాతి సర్వం
తస్య భాసా సర్వ మిదం విభాతి.

కఠ. ద్వి. ద్వి. 15.

పరమాత్మ ఎదుట సూర్యుడు ప్రకాశింపడు. చంద్రుడు, నక్షత్రములు ప్రకాశింపరు. ఈ విద్యుచ్ఛక్తికి ప్రకాశము లేదు. అగ్నికి ప్రకాశ మెక్కడిది? స్వయంప్రకాశమాన మగు పరమాత్మయొక్క కాంతిని ప్రతిబింబించియే వీరందరును ప్రకాశించుచున్నారు. ఆ పరమాత్మయొక్క కాంతివల్లనే ఈ సూర్యచంద్రాదిజ్యోతిస్సమూహమున కంతకును ప్రకాశము కలుగుచున్నది.

Before the Paramaathma the Sun does not shine nor the moon and the stars nor these electric lightings and much less the fire, all these shine reflecting His light. By His light all these become illuminated.

## vii

### ప్రాణమునకు ప్రాణము

### Life of Life

15. శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో
యద్వాచో హ వాచం స ఉ ప్రాణస్య ప్రాణః
చక్షుషః చక్షు రతిముచ్య ధీరాః
ప్రేత్యాస్మా ల్లోకాదమృతా భవన్తి.

కేన. ప్రథమఖండం. 2.

ఈశ్వరుడు శ్రోత్రమునకు శ్రోత్రము, మనస్సునకు మనస్సు, వాక్కునకు వాక్కు, ప్రాణమునకు ప్రాణము, కన్నులకు కన్ను, అయి యున్నాడు. దీనిని జ్ఞానులు తెలిసికొని ఈ శరీ రానంతరము మోక్షమును పొందుచున్నారు.

It ls by the power of Easwara that the ear hears. So He is the ear of the ear. It is by His power that the eye sees. So He is the eye of the eye. It is by His power that the tongue speaks, life functions and mind uuderstands. So, He is the tongue of the tongue, life of life, and mind of the mind. The wise man realises this and attains immortality after death.

16. యచ్చక్షుషా న పశ్యతి
యేన చక్షూంసి పశ్యతి
తదేవ బ్రహ్మ త్వం విద్ధి.

కేన. ప్ర. 7.

ఏది కనులకు కనబడదో, దేనివలన కన్నులు చూచు చున్నవో, అదియే పరబ్రహ్మ మని తెలసికొనుము.

Know that alone to be Parabrahma whom the eyes cannot see, but by whose grace the eyes possess the power of sight.

17. ప్రాణ శరీర నేతా.

ముండక. ద్వి. ద్వి. 8.

ప్రాణమునకును శరీరమునకును ప్రభువు.

He is the Lord of both life and body.

## viii

### ప్రేమస్వరూపుడు (God is Love)

18. ప్రియ మిత్యేన దుపాసీత.

బృహదారణ్యక. 4-1-3.

ఆయనను ప్రేమస్వరూపు డని యుపాసించవలెను.

He should be worshipped as Love,

19. ప్రపంచోపశమం శాన్తం శివ మద్వైతం.

మాండూక్య. 7.

ఆ పరమాత్మ జగత్తునకు అంతటికి లయస్థానము. రాగ ద్వేషాదులు లేని శాన్తస్వరూపుడు, మంగళకరుడు, అద్వితీయుడు.

Paramaatma is the place of rest after dissolution. He is Peace and Bliss. He is Benevolence. He is one without a second.

ix

సత్యస్వరూపము

**He is Truth Himself**

20. సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ.

తైత్తిరీయ. బ్రహ్మవల్లి. ప్ర. 1.

ఆ పరమాత్మ సత్యస్వరూపము, జ్ఞానము, అనన్తము అయి యున్నది.

Paramaatma is Truth, Intelligence and Infinitude.

21. తస్యోపనిషత్ సత్యస్య సత్యమ్.

బృహదారణ్యక. 2-1-20.

పరమాత్మకు ఉపనిషత్తులలో నివ్వబడిన పేరు "కేవలము సత్యము" అని.

The name given to God by the Upanishads is "Truth of Truth, ie. Absolute Truth."

22. యత్ర తత్సత్యస్య పరమం నిధానమ్.

ముండక. తృ. ప్ర. 6.

పరమాత్మయే సత్యమునకు స్థానము.

**God is the seat of Truth.**

23. తదమృత మభయ మేత ద్బ్రహ్మేతి తస్యహవా
ఏతస్య బ్రహ్మణోనామ సత్యమితి.

ఛాందోగ్య. అష్ట. తృతీయ. 4

ఇదియే అమృతము, అభయప్రదము. ఇదియే పర బ్రహ్మ మనబడుచున్నది. అట్టి యీ పరబ్రహ్మమునకు సత్య మని పేరు.

This alone is immortal and gives protection from fear. This alone is called Parabrahma. Truth is the name of Parabrahma.

[ప్ర రా:— మహమ్మదు ప్రవక్త ఏకేశ్వరోపాసనను బోధించుచుండగా బహుదేవతార్చనపరులును, విగ్రహము లను పూజించువారలు నగు ఆయన దేశీయులు ఆయనను చంపుటకై యత్నించిరి. ఆయన తన ముఖ్యశిష్యుడగు "అబూబకర్"తో కూడ శత్రువులనుండి తప్పించుకొనుటకు పారిపోయి ఒక కొండగుహలో దాగుకొనెను. శత్రువులు వారిని వెంబడించి తరుముకొని వచ్చుచుండిరి. వా రా కొండగుహలో నున్నటుల వారికి తెలియదు. ఆ కొండగుహ ముందునుంచి అనేక పర్యాయములు శత్రువులు అటు నిటు పోయిరి. లోపల నున్న 'అబూబకర్'కు కంపమెత్తెను. 'మనమిద్దరమే యుంటిమే!' వారు లోపలికి వచ్చినచో మన గతి ఏమగును, అని ఆయన ప్రశ్నించెను. అందుపైన ప్రవక్తమహమ్మద్ "మనమిద్దర ముండుటేమి? మనము ముగ్గురమున్నాము. మూడవవాడు సర్వశక్తిమంతుడును, మనకు తండ్రియు నగు పరమేశ్వరుడు. ఆయన మనవద్ద నున్నాడు. నిర్భయముగా నుండుము" అని అబూబకర్‌ను మందలించెను. అబూబకర్ మనశ్శాంతిని

పొంది ధైర్యముగా నుండెను. శత్రువులు గుహలోనికి రాకుండనే నారి త్రోవను పోయిరి. ముహమ్మద్ ప్రవక్త, అబూబకర్ ఉభయులును అచటినుండి వెళ్ళి మరియొక సురక్షితమైన ప్రదేశమును చేరిరి. ఈశ్వరభక్తులకు ఈశ్వరుడు తమతో కూడ నున్నాడని తెలియుటవలన ఎంత నిర్భయత్వము కలుగునో దాని కిది యుదాహరణము.]

24. సత్య మేవ జయతే, నానృతం.

ముండక. తృ. ప్ర. 6.

సత్యమే జయమును పొందును. అసత్యము జయించదు.

Truth alone will triumph. Untruth will not succeed.

X

ధర్మనిలయం (Seat ot Virtue and Dharma)

25. శుద్ధ మపాపవిద్ధమ్.

ఈశావాస్య. 8.

ఆయన పాపరహితుడు, పరిశుద్ధుడు, పవిత్రుడు.

He is untainted by sin. He is pure and holy.

26. స వృక్షకాలాకృతిభిః పరోఽన్యో
యస్మాత్ ప్రపఞ్చః పరివర్తతేఽయం
ధర్మావహం పాపనుదం భగేశం
జ్ఞాత్వాఽత్మస్థ మమృతం విశ్వధామ.

శ్వేతాశ్వతర. 6-6.

ఈ విశ్వముయొక్క పుట్టుకకు లయమునకు కారకు డెవరో, యావత్తు ధర్మమునకు మూలస్థాన మెవరో, పాపముల

నశింపు జేయువాడును, సుగుణములకెల్ల నిలయమును, శాశ్వతుడును, విశ్వమునకు ఉనికి పట్టు నెవరో, అట్టి పరమాత్మను తన లోపలనే యున్నట్లును, సంసారవృక్షమునకును, కాలమునకును, రూపమునకును అతీతుడుగను భక్తులు దర్శించుచున్నారు.

Knowing Him, who is the origin and dissolution of the Universe — the source of all Dharma (righteousness,) the destroyer of all sin, the source of all Virtue, the immortal and the abode of the Universe — as seated in one's own self, Hs is perceived as different from and transcending the tree of Samsaara as well as time and form.

27. పరాత్పరం పురుష ముపైతి దివ్యమ్.

ముణ్డక. తృ. ద్వి. 8.

(ఆత్మవేత్తలు) ప్రకాశమానుడును అన్నిటికన్న శ్రేష్ఠుడు నగు పరమపురుషుని పొందుచున్నారు.

Seekers of Paramaatma attain' Him, who is the source of light and the highest, noblest and supreme personality.

28. తచ్ఛ్రేయో రూప మత్యసృజత ధర్మం;
తస్మా ద్ధర్మా త్పరం నాస్తి
అథో అబలీయాన్ బలీయాం సమాశంసతే
ధర్మేణ, యోవై స ధర్మః సత్యం వైతత్.

బృహదారణ్య. 1-4-14.

ధర్మము అను ఉత్కృష్టరూపమును ఆయన దాల్చెను. ధర్మముకన్న గొప్పది లేనేలేదు. తన పక్షమున ధర్మముగల బలహీనుడు ఎంతటి బలవంతునైన నోడించగలడు. ధర్మమే సత్యము.

He projected that excellent form (of His) namely Dharma (Righteousness and Justice). There is nothing higher than Dharma. Even a weak person can defeat a mighty person with the weapon of Dharma. Dharma is Truth.

పరా:—పై 20 మొదలు 28 వరకు చెప్పబడిన మంత్రములు అతిప్రాముఖ్యమైనవి. "పరమేశ్వరుడు పాపరహితుడు, పరిశుద్ధుడు, ధర్మస్వరూపుడు; సత్యమని ఆయనపేరు. ధర్మమే సత్యము" అని వీటిలో చెప్పబడినవి. సృష్టిచేయుటలో ఈశ్వరుని యుద్దేశ్యము ధర్మసంస్థాపనమై యున్నది. అధర్మమునకును ధర్మమునకు నిరంతరము పోరాటము జరుగుచు ధర్మమే జయించుచు మానవకోటిలో ధర్మముయొక్క అభివృద్ధి జరుగుచుండును. ఇది మానవకోటియొక్క నైతిక అభివృద్ధి (Moral evolution). ధర్మపక్షమున నున్నవాడు కడు బలహీనుడైనను ఎంతటి బలవంతు డెదుర్కొనినను ఆ బలవంతు నోడించగలడు, ధర్మమే జయించి తీరు ననునది యీశ్వరశాసన మని పై మంత్రములు చెప్పుచున్నవి. హిందూదేశములోని పురాణము లన్నింటిలోను ధర్మమునకు ప్రతినిధులగు దేవతలకును, అధర్మమునకు ప్రతినిధులగు రాక్షసులకును ఎల్లప్పుడును పోరాటములు జరుగుచున్నటులను తాత్కాలికముగా దేవత లోడిపోయి కష్టముల పాలగుచున్నటులను, కాని ధర్మస్వరూపుడగు భగవంతుని సహాయము వారికి గలిగి వారు విజయముపొంది, సుఖవంతు లయినటులను అనేక కథలను ఇచ్చి ప్రజల మనస్సులకు ఈ సత్యమును బాగుగా నాటజేసి యున్నారు.

ధర్మమునకు ప్రతినిధులయిన దేవతలకే భగవంతుడు అమృతము నిచ్చినటుల కూడ వర్ణించబడినది. అమృత

మనగా జరామరణముల నుండియు, దుఃఖమునుండియు విముక్తి, శాశ్వతశాంతి. ఉపనిషత్తుల తరువాత ప్రధాన గ్రంథమైన భగవద్గీత 4 వ అధ్యాయము 7,8 శ్లోకములలో ధర్మమునకు క్షీణత గలిగి, అధర్మము వృద్ధియైనపుడు ధర్మసంస్థాపనము కొరకు అవసరమైనపుడెల్ల నేను భూలోకమున పుట్టుచున్నాను, అని శ్రీకృష్ణుడు చెప్పిన వాక్యములు భారతీయులచేత జ్ఞాపకముంచుకొనబడి తాత్కాలికముగా ధర్మచ్యుతి కలిగినను మహాపురుషులు పుట్టి ధర్మమును పునరుద్ధరింప జేయుదురను నమ్మకమును దృఢముగా కలిగింప జేసినవి. విముక్తి చెందిన జీవాత్మలు భగవదుద్దేశ్యమైన ధర్మస్థాపనము కొరకు భూలోకమునం దవతరించి తమ కార్యమును నెరవేర్చి పోదురని బ్రహ్మసూత్రములు 3-3-32లో చెప్పబడినటుల రాబోవు 4వ పాఠము యొక్క చివరను చూపించియుంటిమి. మహాభారతము యొక్క యుద్దేశ్యముకూడ ధర్మపక్షావలంబులగు పాండవులు ప్రథమమున ఎన్నికష్టములు పొందినను భగవంతుని సాయమువలన అధర్మపరులగు కౌరవుల నోడించి విజయము పొందినటుల చూపించుటయే యైయున్నది. పిమ్మట చాలకాలమునకు వచ్చిన బౌద్ధమతములో కూడ బుద్ధభగవానుడు ధర్మస్థాపనము కొరకు ప్రపంచములో ననేకావతారముల నెత్తుచున్నాడని చెప్పబడియున్నది. ఇందుకొఱకు మోక్షమును పొందిన జీవాత్ములగు బోధిసత్వులు భూలోకమునకు వచ్చి పోవుచుందురని చెప్పబడినది. పిమ్మట నవతరించిన ఏసుక్రీస్తు ప్రభువు కూడ తాను పరమేశ్వరుని రాజ్యమును, అనగా ధర్మమును భూలోకమున స్థాపింప వచ్చితి నని చెప్పియున్నాడు.

ధర్మసంస్థాపన మనగ మానవులకును మానవసంఘము లకును మానవజాతులకును కలిగెడి కష్టములను అన్యాయము లను తొలగించి వారియొక్క ఐహికాముష్మికమైన అభివృద్ధికి పాటుబడుటయై యున్నది. ప్రస్తుతకాలమున అస్పృశ్యుల అస్పృశ్యతను పారదోలుట, స్త్రీల హక్కుల పునరుద్ధరణము, రయితుల కార్మికుల కష్టముల నివారణ, క్షామములు భూకంప ములు మహామారి కలరా మొదలగు వాటివలన బాధితులగు వారి సహాయము కొరకును, అజ్ఞానమును, దరిద్రమును, వ్యాధులను పారదోలుటకొరకును సాంఘిక సేవానిర్మాణము (Organised Social service,) మానవుల కుపయుక్తములగు శాస్త్రశోధనలు (Scientific Researches) మానవులలో ఆధ్యాత్మిక జ్ఞానవ్యాపకము, ప్రజల సౌఖ్యమును అభివృద్ధిని కలుగజేయు రాజ్యపాలనను స్థాపించుట శిష్టరక్షణము దుష్ట శిక్షణము, భారతదేశోద్ధరణము, చైనాజాతియొక్క స్వతంత్ర మును సంరక్షించుటకు దుష్టమైన జపానుతో చైనా జాతీయ నాయకుడగు చ్యాంగుకేషక్ జరుపుచున్న స్వతంత్ర పోరా టము, ప్రపంచమును కష్టపెట్టుచున్న యుద్ధములు పోరాట ములు మరల జరుగకుండ విశ్వమానవ జాతిలో శాశ్వతమైన శాంతి, అన్నిజాతులమధ్యను స్నేహవాత్సల్య సోదరభావములు వర్థిల్లునటుల మానవకోటియొక్క పునర్నిర్మాణము, మొద లగున వన్నియు ధర్మసంస్థాపనము క్రిందికి వచ్చును. ఈ కాల మున రైళ్ళు, స్టీమరులు, ఆకాశవిమానములు, కేబిల్ గ్రాములు, రేడియోలు, మొదలగు వాని మూలమున మానవజాతులన్నియు ఏకముగ చేయబడి యొకే కష్టసుఖము

లకు లోబఱుపబడినవి. ఇట్టి పరిస్థితులలో ప్రతి వ్యక్తియు తన యొక్క స్వంతమోక్షము కొరకు మాత్రము యోచించక మాతృదేశము యొక్కయు మానవకోటియొక్కయు మోక్షమే తనమోక్షమని భావించి కృషిసలుపు టవసరమై యున్నది. ప్రపంచము, దేశము, సుఖముగా నుండనిదే వ్యక్తులకు సుఖ మెట్లుల కలుగును ?

కావున ఏ భారతీయుడైనను ప్రపంచము నావరించిన దుఃఖవిముక్తికొరకును, భారతదేశమునావరించియున్న దైన్యస్థితిని బోగొట్టుటకును, పనిచేయకుండ తనయొక్క వ్యక్తిమోక్షము కొరకై ప్రయత్నింతునని యనుకొనుట వట్టిభ్రమ. మానవకోటి యొక్కయు మాతృదేశముయొక్కయు మోక్షమే వ్యక్తి యొక్క మోక్ష మని భావింపవలయును. శ్రీరామానుజుల వారిని గురించి యొక కథ గలదు. వారిగురువు ఆయన కొక గొప్ప మంత్రము నుపదేశించెను. ఆ మంత్రము నుపాసించుట వలన ఆయనకు మోక్షము లభించును. కాని ఆయన ఆ మంత్రము నితరుల కుపదేశించిన యెడల వారికి మోక్షము గల్గుట నిజమేకాని, ఆయనకు మాత్రము మోక్షమునకు బదులు నరకము కలుగునని గురువుయొక్క ఆజ్ఞ. కాని రామానుజుల వారు తాను నరకమునకు పోయినను సరే, తోడిమానవు లంద రును మోక్షమునకు పోవలసినదే యని తలచి శ్రీరంగదేవా లయము గాలిగోపురము మీదికి ఎక్కి అనేక వేలమంది జను లకు వినబడునటుల ఆ మంత్రము నుచ్చరించి, యీ మంత్రమును మీ రుపాసించినచో మీకు కైవల్యము కలుగునని బిగ్గరగా చెప్పెను. ఇది ఆయనయొక్క గొప్ప త్యాగమును తెలుపు

చున్నది. అందువలన ఆయనకు మోక్షమే వచ్చెను. ఈరామానుజులవారే అప్పటికి చాలకాలమునుంచి అంటరానివారుగా చూడబడి, దూరముగా నుంచబడి, మానవ హక్కులను కోల్పోయిన జాతులందరికిని తన భక్తిమార్గమగు ఈశ్వరుని ప్రేమతత్వమును బోధించి అస్పృశ్యతను తీసివైచి తక్కిన అన్ని కులములతో బాటు సమాన ప్రతిపత్తిని వారికికూడ కలుగచేసెను. ఇది ధర్మసంస్థాపనమునకు గొప్ప నిదర్శనము.

ఈ ధర్మసంస్థాపన యజ్ఞమును గావించుటలో సమర్పించవలసిన దక్షిణాలనుగూర్చి అనగా సాధనములనుగూర్చి రాబోవు అయిదవ పాఠముయొక్క 1న నెంబరు మంత్రమును చూడుము.

## xi
## ఆనందస్వరూపుడు
## He is Bliss itself

29. తద్విజ్ఞానేన పరిపశ్యన్తి ధీరా
ఆనన్దరూప మమృతం యద్విభాతి.

ముణ్డక. ద్వి. ద్వి. 8.

అమృతమయుడును ఆనందస్వరూపుడు నగు పరమాత్మను పరిపూర్ణమైన జ్ఞానముచేత నుపాసించి ధీరు లగువారు బాగుగ చూచుచున్నారు.

The wise meditate by perfect knowledge and realise Paramaatma, who is immortal and Bliss itself.

30. రసోవై సః, రసగ్గ్ం హ్యేవాయం లబ్ధ్వాఽఽనన్దీ భవతి
కోహ్యేవాన్యాత్కః ప్రాణాత్ యదేష ఆకాశ
ఆనన్దో నస్యాత్ ఏష హ్యేవానన్దయాతి.

తైత్తిరీయ. బ్రహ్మ, సప్తమ 1.

ఆ పరమాత్మ ఆనందస్వరూపుడే. ఉపాసకుడగు జీవుడు ఆ యానందరసమును పొంది ఆనందము కలవాడగుచున్నాడు. ఏ కారణమువల్లనైనను సర్వలోకప్రకాశకుడైన, ఆనందరస స్వరూపుడైన పరమాత్మ లేకపోయిన యెడల మరియెవడు ఇటుల (జీవుని) నడిపించును? ఎవడిటుల ప్రాణము నిచ్చి యుజ్జీవింపచేయును? ఆ పరమాత్మయే ఆనందింపజేయుచున్నాడు.

Paramaatma is Bliss itself. The Jeevaatma that worships Him gets the Bliss and becomes joyful. If for any reason the Paramaatma, the illuminer of the creation and the embodiment of Bliss, does not exist, who else will guide the individual soul like this and give life to him and inspire him like this ? It is Paramaatma that gives Joy to him (individual soul.)

31. ఆనన్దో బ్రహ్మేతి వ్యజానాత్
ఆనన్దాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే,
ఆనన్దేన జాతాని జీవన్తి
ఆనన్దం ప్రయన్త్యభిసంవిశన్తీతి.

తైత్తిరీయ. భృగు. వల్లి.

ఆనంద మయుడగువాడు పరమాత్మయే యని తెలిసుకొనవలెను. ఆనంద మయుడగు పరమాత్మచేతనే కదా ఈ సర్వభూతములు పుట్టుచుండును! అట్లు పుట్టిన భూతకోటియెల్ల ఆ ఆనందమయుని చేతనే జీవించుచున్నది. ఆ ఆనందమయుని యందే లయించి ప్రవేశించుచున్నది.

Understand that Paramaatma is Bliss. All beings are born from Paramaatma who is Bliss itself. Having been born, they remain alive by the Blissful Paramaatma, and on departing they enter into the Blissful.

[వ్యా— ఈశ్వరుని 'సత్' 'చిత్' 'ఆనందం' అని ఉపనిషత్తులు చెప్పినవి. 'శాశ్వతమైనసత్యము' 'జ్ఞానము'

'ఆనందము' అని చెప్పినవి. ఈ విశ్వమంతయు (ఈశ్వరుని) ఆనందములో జన్మించి, ఆనందములో వృద్ధిచెంది, జీవించియుండి ఆనందములో లయమగుచున్నదని పై మంత్రము చెప్పుచున్నది. ఆనందము సుఖముకంటె చాల సుత్కృష్టమైనది. సుఖము ఇంద్రియలోలత్వమై కల్మషమై క్షణభంగురమై దుఃఖభూయిష్ఠము కావచ్చును. ఆనంద మటులగాక కల్మషరహితమై పరిశుద్ధమై శాశ్వతమైయున్నది. మానవుడు (జీవుడు) స్వభావము చేత ఆనందమయుడు. జీవితము సహజముగ ఆనందముతో కూడినది. అందువలననే ప్రతిజీవికిని ఎట్టికష్టములు కలుగుచున్నను జీవించవలె నను కోరిక స్వభావముగ నుండును. సృష్టియొక్క సౌందర్యము, పవిత్రమైన ప్రేమ, జ్ఞాన సంపాదనము, మధురగానము, శిల్పము, చిత్రరువులు, కవిత్వము మొదలగు లలితకళల యుపాసన, మానవునికి ఆనందమును కలుగ జేయుచున్నవి. ఈశ్వరు డనెడి వీణాగానములో జీవుడొక మధురశృతి యగుటకు ప్రయత్నించవలెనని ఉపనిషత్తులు శాసించుచున్నవి. కాని మానవుడు ఇంద్రియలోలుడై దురాశాపరుడై, దుష్టచింతనగలవాడై, స్వల్పసుఖములను కోరి తాపత్రయములలో చిక్కుకొని ఆనందమును కోల్పోయి దుఃఖమును పొందుచున్నాడు. సేవా త్యాగములతో కూడిన పవిత్రమైన, ఉత్తమమైన జీవితమువలన, సరియైన జ్ఞానమువలన, ఈశ్వరోపాసన వలన, మానవుడు తన జీవితమును దుఃఖరహితమైన ఆనందమయముగా చేసికొనవలె నని యుపనిషన్మతము. మానవుని జన్మ ఆనందమును పొందుటకే యుద్దేశించబడినది. దుఃఖ పడుటకు కాదు.]

# నా లు గ వ పా ఠ ము

## జీ వా త్మ

## (Individual Soul)

1. నిత్య శ్శాశ్వతోయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే.

కఠోపనిషత్. ప్రథమాధ్యాయము, ద్వితీయవల్లి. 18.

ఈ జీవాత్మ ఎల్లప్పుడు ఉండునది. శాశ్వతమైనది. సనాతనమైనను క్రొత్తది. శరీరము చంపబడుచున్నను, జీవాత్మ చంపబడదు.

The Individual soul is eternal and permanent. Though ancient, it is always fresh. It cannot be killed though the body (in which it dwells) is killed.

2. తస్మై స హోవాచ
ఇహైవాన్తశ్శరీరే సోమ్య స పురుషో
యస్మిన్నేతాః షోడశకళాః ప్రభవన్తీతి.

ప్రశ్న. షష్ఠ. 2

ఏ పురుషునియందు ఈ షోడశకళలు పుట్టుచున్నవో ఆ పురుషుడు (జీవాత్మ) ఈ శరీరము లోపల నున్నాడు.

The Individual soul who possesses sixteen kalas dwells inside this body.

3. సప్రాణ మసృజత.

ప్రశ్న. షష్ఠ. 4.

జీవుని యనుభవమునకుగాను ప్రాణము సృజింపబడెను.

Life is created for the enjoyment of the soul.

4. ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం
వృక్షం పరిషస్వ జాతే తయో రన్యః పిప్పలం
స్వాద్వ త్త్యనశ్న న్నన్యో అభిచాక శీతి.

ముణ్డకోపనిషత్. తృతీయ ముండక. ప్రథమఖండ 1.

సమానమగు ఆధ్యాత్మస్వభావము కలిగినట్టియు, శాశ్వత సఖులైనట్టియు, పక్షిసదృశు లగు నిద్దరు (జీవేశ్వరులు) ఒకే (శరీరము) వృక్షములో నివసించుచున్నారు. వారిద్దరిలో నొక డగు జీవుడు (అజ్ఞానమువలన) రుచిగా కనబడునట్టి సుఖదుఃఖ లక్షణాత్మక మగు కర్మఫలమును తినుచున్నాడు. రెండవవాడగు ఈశ్వరుడు, ఆ కర్మఫలమును అనుభవించక సాక్షిమాత్రుడై చూచుచున్నాడు.

Two birds [The Purusha and the Paramapurusha] of the same spiritual nature who are inseparable friends dwell in the same tree. [the body] One of them [the Purusha] enjoys [in his ignorance], the fruits of the body namely the joys and sorrows thereof ; while the other [Paramapurusha] does not taste the fruits but remains a mere witness.

5. సమానే వృక్షే పురుషో నిమగ్నో
అనీశయా శోచతి ముహ్యమానః
జుష్టం యదా పశ్య త్యన్య
మీశ మస్య మహిమాన మితి వీతశోకః.

ముణ్డక. తృతీయ. ప్రథమ. 2

తనకు సమీపముగా నున్న ఈశ్వరుని మరచినవాడై శరీరమునందలి జీవుడు సంసారములో మునిగి దుఃఖము పొందు చున్నాడు. వేరుగా నుండువాడును శ్రీమన్నారాయణుడును అగు

పరమేశ్వరుని మహిమను జీవుడు ఎప్పుడు చూచునో ఆ వెంటనే సర్వదుఃఖ విముక్తు డగును.

In this tree [body] the purusha forgets the Paramapurusha who is so near him, gets himself entangled in Samsara and becomes immersed in grief. As soon as he realises the love and glory of the Paramapurusha who is in the same tree [body] he attains freedom from all grief.

[మరా — ఈ మంత్రములవలన జీవుడు ఈశ్వరుని వంటి స్వభావము గలవాడని, ఈశ్వరునికి శాశ్వతసఖుడని చెప్పబడినది. జీవుడు కూడ సహజముగ స్వతంత్రుడు, ఆనందమయుడు; కాని అజ్ఞానమువలన (జీవుడు) మానవుడు ఇంద్రియసుఖములలో నిమగ్నుడై ఈశ్వరుని మరచి స్వతంత్రమును, ఆనందమును కోల్పోవుచున్నాడు. జ్ఞానమును పొంది ఈశ్వరుని తెలిసికొనగనే మరల స్వతంత్రమును, ఆనందమును పొందుచున్నాడు.]

6. ఏషహి. ద్రష్టా స్ప్రష్టా శ్రోతా ఘ్రాతా రసయితా
మంతా బోద్ధా కర్తా విజ్ఞానాత్మా పురుషః.

ప్రశ్న. చతుర. 9.

ఈ జీవాత్మయే చూచువాడు, స్పృశించువాడు, వినువాడు, వాసనచూచువాడు, రుచిచూచువాడు, తలచువాడు, తెలిసికొనువాడు, చేయువాడు, జ్ఞానస్వరూపు డగు పురుషుడు.

It is the Individual soul who is the intelligent Purusha [in the body] that sees, touches, hears, smells, tastes, thinks, understands and acts.

7. ఆత్మానగ్ం రథినం విద్ధి శరీరం రథమేవతు
బుద్ధింతు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవచ

కఠ. ప్రథమ. తృతీయ 3.

ఈ జీవయాత్రి చేయుటలో శరీరము అను రథముమీద (శరీరమునకు యజమానియగు) జీవాత్మ అను రథికుడు ఎక్కి (ఇంద్రియములను గుఱ్ఱములను రథమునకు కట్టి) తన మనస్సనెడి పగ్గములో వాటిని లాగుచు తన బుద్ధి అనెడి సారథితో రథమును తోలించుచున్నాడు.

Know that the Jeevatma [Individual soul] is the master of the chariot and sits within it and that the body is the chariot. [in the soul's pilgrimage of life] He uses his own intellect as the driver of the chariot and his own mind as the reins [that direct and control the senses which are the horses of the chariot.]

8. జీవాపేతం వావ కిలేదం మ్రియతే
నజీవో మ్రియతే. ఛాందోగ్య. షష్ఠ. ఏకాదశ. 3

ఈ శరీరము జీవునిచేత విసర్జించబడియే నశించుచున్నది. జీవుడు నశింపడు.

As soon as the Individual Soul leaves this body, this body dies but the Individual Soul will not die.

పరా:—సామాన్యముగా మానవుని త్యాగమునుండి వెనుకకు లాగునది మరణముయొక్క భయము, శరీరమునందును శరీరసుఖములయందునుగల ప్రీతి అయియున్నవి. ఈ శరీరము, ఈ శరీరసుఖములు, కొద్ది కాలము మాత్రిముండునవి. ఈ కాలము అనంత కాలములో ఇసుక రేణువువంటిది. శరీరమునకు మరణము తప్పదు. శరీరములో జీవాత్మ అనునది యొకటి కలదు. అది శరీరము చంపబడినను చచ్చునదికాదు. నే ననునది జీవాత్మయే. అది ఉత్తమ జన్మలకు పోవుటకును ఆత్మోన్నతి పొంది శాశ్వత ఆనందము పొందుటకును మనసు

సదా ప్రియత్నించవలెను, అను జ్ఞానము కలిగినచో శరీరము నందును, శరీర సుఖములయందును గల అనవసరమైన ప్రీతి పోయి మరణమునకు లక్ష్యపెట్టక ఎట్టి త్యాగములనైన గొప్ప ఆదర్శముల కొరకు చేయుటకు మానవుడు వెనుదీయడు. అతని యొక్క ఆత్మశక్తి విజృంభించి, ధైర్యము కలిగి, ధర్మము కొరకునుసత్యము కొరకును, కృషి సల్పుటయే జీవిత పరమావధి యని గ్రహించి అందులో తనను ఆత్మార్పణ గావించు వాడగును.

9. మఘవ న్మర్త్యం వా ఇదగ్ శరీర మాత్తం మృత్యునా,
తదస్యామృత స్యాశరీరస్యాత్మనోఽధిష్ఠాన మాత్తోవై
సశరీరః ప్రియా ప్రియాభ్యాం సహావైన శరీరస్య సతః
ప్రియాప్రియయో రపహతి రస్త్య శరీరంవా వసన్తం
నప్రియాప్రియే స్పృశతః. ఛాందోగ్య. అష్టమ. ద్వాదశ. 1.

ఓ ఇంద్రుడా! ఈ శరీరమే మరణము పొందు పదార్థము. మృత్యువుచేత వ్యాపింపబడియే యుండును. ఈ శరీరము అమృతమయుడైనట్టియు శరీరరహితుడైనట్టియు ఈ జీవాత్మకు కర్మవశమున కలుగు సుఖదుఃఖానుభవమునకు స్థానము. శరీర సహితుడైన ఈ జీవాత్మ సుఖదుఃఖములచేత ఆక్రమింపబడి యుండును. శరీరయుక్తుడై యుండగా సుఖదుఃఖములకు నాశనములేదు. జననమరణములనుండి విముక్తుడైన జీవుని సుఖదుఃఖములు స్పృశించవు.

O Indra! it is this body that dies and it is surrounded by death. This body is the abode of the Purusha. [Individual soul], who is without form and is blissful, for his enjoyment of pleasures and pains caused by his deeds [Karma past and present]. This purusha encaged in a body is subject to joys and sorrows which do not leave him till he becomes free

from births. [Encagement in the body]. The freed Individual soul is not touched by pleasures and pains.

10. అన్నాద్భూతాని జాయన్తే జాతా న్యన్నేన వర్ధంతే
అద్యతేఽత్తి చ భూతాని తస్మాదన్నం తదుచ్యత ఇతి
తస్మా ద్వా ఏతస్మా దన్నరసమయాత్ అన్యోఽన్తర
ఆత్మా ప్రాణమయః తేనైషపూర్ణః సవా ఏష పురుష
విధఏవ తస్య పురుష విధతాం. అన్వయం పురుష విధః.

తైత్తిరీయ. బ్రహ్మా. ద్వి. 1.

అన్నమువలన సర్వభూతములు పుట్టుచున్నవి. అట్లు పుట్టిన జీవములన్నియు అన్నము వలననే వృద్ధిపొందుచున్నవి. అన్నము భూతములకు భోగ్య పదార్థమై భుజింపబడుచున్నది. భూతములను మరల లయింపజేసి కొనుచున్నది. గనుక అది అన్నమని చెప్పబడుచున్నది (అన్నమనగ ప్రకృతియని కూడ అర్థము). అట్టి యీ అన్నరసమయమైన (ప్రకృతి పదార్థమైన) దేహముకంటె ఇతరమైన ప్రాణమయము, ఈ దేహమునకు లోపలనున్నది. (అనగా అన్నమయకోశము లోపలిదై, దానిని నడిపించుచున్నది ప్రాణమయకోశము.) ఈ ప్రాణమయము చేత అన్నమయము వ్యాపించబడియున్నది. ఈప్రాణమయము కూడ పురుషాకారము కలదే. అన్నమయముయొక్క (శరీరము యొక్క) పురుషాకారత్వమును అనుకరించి ఈప్రాణమయము కూడ పురుషాకారము కలది యగుచున్నది.

Living beings are born from food (matter); those that are born are reared by food. Food is consumed by them and finally they are consumed by matter. Hence it is called "Annam". Verily other than the body called Annamaya, which is formed from the essence of food, there is another inside it which controls it and that is the vital force called

Pranamaya. The body is filled and pervaded by the vital force or life [pranamaya]. That also assumes the form of a person according to the form of the body.

11. ప్రాణం దేవా అనుప్రాణన్తి మనుష్యాః పశవశ్చయే.
ప్రాణోహి భూతానా మాయుః
తస్మా త్సర్వాయుష ముచ్యతే, తస్మాద్వా
ఏతస్మా త్ప్రాణమయాత్ అన్యోఽన్తర
ఆత్మామనోమయః తేనైషపూర్ణః సవాఏషపురుషవిధఏవ
తస్యపురుష విధతామ్ అన్వయం పురుషవిధః.

'తైత్తిరీయ, బ్రిహ్మ. తృతీయ.

దేవతలుకూడ ప్రాణమువలన జీవించుచున్నారు. మనుష్యులును పశ్వాది జీవజంతువులును ప్రాణమువలన జీవించుచున్నారు. సమస్త భూతములకును ప్రాణమే ఆయువుగనుక ప్రాణము సర్వభూతములకును ఆయువని చెప్పబడుచున్నది. ఇదివరకు చెప్పబడిన ప్రాణమయమునకు లోపల అన్యమైన మనోమయము ఉన్నది. మనోమయముచేత ప్రాణమయము వ్యాపింపబడి యున్నది. నడిపింపబడుచున్నది. ఈ మనోమయముకూడ పురుషాకృతి కలదే. ప్రాణమయముయొక్క పురుషాకారత్వము ననుసరించి మనోమయముకూడ పురుషాకారము కలది యగుచున్నది.

Whatever gods' men, or other living beings exist, all of them depend upon Prana [vital force] for their life Truly Prana is the life duration of all animate world. On this ground it is regarded as the universal life. Verily other than the Prana, there is another inside it which controls it, and that is the mind called manomaya. The life is filled and pervaded by the mind [mental force]. That also assumes the form ofa pers on according to the form of the life.

12. తస్మాద్వా ఏతస్మాన్మనోమయాత్
అన్యోఽన్తర ఆత్మా విజ్ఞానమయః
తేనైష పూర్ణః సవా ఏష పురుషవిధ ఏవ
తస్య పురుషవిధతామ్ అన్వయం పురుషవిధః,
తైత్తిరీయ. బ్రహ్మ. చతుర్థ.

అట్టి ఈ మనోమయకోశములోపల అన్యుడైన జీవాత్మ కలదు: దానికి విజ్ఞానమయు డని పేరు. ఈ విజ్ఞానమయునిచేత మనోమయకోశము వ్యాపింపబడియున్నది. నడిపింపబడుచున్నది. విజ్ఞానమయుడుకూడ పురుషాకృతి గలవాడే. మనోమయము యొక్క పురుషాకృతి ననుసరించి విజ్ఞానమయు డగు జీవాత్మ కూడ పురుషాకారము కలవాడగుచున్నాడు.

Inside the mental plane, other than the mind, exists the Individual soul called Vijnanamaya. The mental kosa is pervaded and oontrolled by the Vijnanamaya [soul]. The soul also assumes the form of a person according as the Manomaya does.

13. విజ్ఞానం యజ్ఞం తనుతే కర్మాణి తనుతేఽపిచ
విజ్ఞానం దేవాస్సర్వే। తస్మాద్వా ఏతస్మా
ద్విజ్ఞానమయాత్ అన్యోఽన్తర ఆత్మాఽఽ
నన్దమయః తేనైష పూర్ణః.
తైత్తిరీయ. బ్రహ్మ. పంచమ.

విజ్ఞానమయుడగు జీవాత్మయే యజ్ఞములను కర్మలను చేయుచున్నాడు. దేవతలందరును (మానవులు మొదలగు జీవ జంతువులును) విజ్ఞానమయులగు జీవస్వరూపులే - అట్టి ఈ విజ్ఞానమయుని లోపల అన్యుడైన ఆనందస్వరూపుడగు పర

మాత్మ కలదు. ఆనందమయుడగు పరమాత్మచేత విజ్ఞానమయుడగు జీవుడు వ్యాపింపబడియున్నాడు. ఆనందమయుడగు పరమాత్మకు విశ్వమువలెనే జీవాత్మకూడ శరీర మగుచున్నది.

This Jiva or individual soul who is Vijnanamaya performs all sacrifices and works. All the Devas [men and other living beings] are individual souls. In the Vijnanamaya other than that, the Universal soul who is Bliss itself exists. The [Universal soul] Anandamaya pervades the individual soul [i. e. the individual soul is the body of the Universal soul.]

[వ్యా:—శరీర శాస్త్రజ్ఞులును ఇతర ప్రకృతి శాస్త్రజ్ఞులును అన్నమయకోశ మగు శరీరమును గూర్చియు, ప్రాణమయకోశ మగు ప్రాణమును గూర్చియు, అనగా బ్రతికియున్న శరీరము చచ్చిన శరీరములను గూర్చియు, ఇటులనే అన్నమని పిలువబడు ఇతర జడపదార్థమును గూర్చియు, దానియందలి ప్రాణమని చెప్పదగిన భౌతికశక్తిని (Energy) గూర్చియు మాత్రమే పరిశోధనలుజేసి అనేక విషయములు కనుగొనియున్నారు. మూడవకోశమగు మనోమయ కోశమును గూర్చి వారికి బహు తక్కువగా తెలియును. విజ్ఞానమయకోశమును గూర్చియు, ఆనందమయ కోశమును గూర్చియు, వారి శాస్త్రములలో విచారించనే లేదు. అంతమాత్రముచేత తమయొక్క పరిశోధనలలో చేరనట్టి జీవాత్మ, పరమాత్మ, అనునవి లేవనిగాని ప్రకృతి శాస్త్రములకు వ్యతిరేకమనిగాని చెప్పుట చాల పొరపాటు. ఈ మహాసృష్టినిగూర్చి పూర్తిగా తెలిసికొనవలెనన్న ఈ అయిదుకోశములనుగూర్చి పూర్తిగా తెలిసికొనవలెను. ప్రకృతి శాస్త్రములు కొంతవరకే పరిశో

ధనలు చేయుచున్నవి. వేదాంతము అనగా ఉపనిషత్తులు, ప్రకృతి శాస్త్రజ్ఞానము నంగీకరించుచు దానికి మించి ఆఖరు కోశమగు ఆనందకోశము వరకుపోయి పరమాత్మను కనుగొని పూర్తిఅయిన జ్ఞానమును ఇచ్చుచున్నవి.]

14. స య శ్చాయం పురుషే,
య శ్చాసావాదిత్యే స ఏక ఇతి.

తైత్తిరీయ. బ్రహ్మ. అష్ట. 1

మనుజుని జీవాత్మలో ఎట్టి ఆనందస్వరూపుడగు పరమాత్మ కలడో, అట్టి ఆనందస్వరూపుడగు పరమాత్మయే సూర్యునియందును కలడు.

The same Blissful Paramaatma that exists in the human soul also exists in the sun.

15. నైవస్త్రీ నపుమానేష నచైవాయం నపుంసకః
యద్యచ్ఛరీర మాదత్తే తేన తేన స యుజ్యతే.

శ్వేతాశ్వతర. అ. 5-10

జీవాత్మ స్త్రీకాదు. పురుషుడు కాదు. నపుంసకము కాదు: ఎట్టి శరీరములో జీవాత్మ నివసించునో ఆ శరీరముతో ఏకత్వము నొందును.

The Individual Soul is neither female nor male nor neuter. Whatever body it assumes, it becomes identified with that.

[వ.రా: — అనగ జీవాత్మలకు లింగ, వర్ణ, కుల, జాతి భేదము కాని భాగ్యవంతులు, పేదవారు అనుభేదము కాని; మనుష్యులు, దేవతలు, పశుపక్షి వృక్షాదులను భేదముకాని లేవు. వాటి వాటి కర్మలనుబట్టి సుఖదుఃఖములను పొందుటకు

మంచి చెడు జన్మముల నెత్తుచుండును. అన్ని జీవాత్మలును మోక్షము పొందుటకు అర్హత కలవే.]

16. యోని మన్యే ప్రపద్యన్తే
శరీరత్వాయ దేహినః
స్థాణుమన్యేఽనుసంయన్తి
యథాకర్మ యథా శ్రుతమ్. కఠ. ద్వి. ద్వి. 7.

వారివారి కర్మల ననుసరించియు వారివారికి గలిగినజ్ఞానము ననుసరించియు కొందరు జీవాత్మలు శరీరమును పొందుటకొరకు గర్భములయందు ప్రవేశించుచున్నారు. (పునర్జన్మము లెత్తుచున్నారు.) మరికొందరు జీవాత్మలు స్థావరభావమగు మోక్షమును పొందుచున్నారు. (పునర్జన్మమునుండి విముక్తిని పొందుచున్నారు.)

According to their deeds and mental, moral and spiritual condition, some Jeevas (individual souls) after leaving this body enter into the wombs for fresh births (in new bodies) while others become free from the cycle of births and deaths and attain Bliss.

17. పుణ్యేన పుణ్యం లోకం నయతి
పాపేన పాపం. ప్రశ్న. తృ. 7

జీవాత్మ పుణ్యకార్యములుచేసి మంచి జన్మలను, పాపకార్యములు చేసి హీనజన్మలను పొందుచున్నది.

The individual soul attains happier and higher births by meritorious acts and lower and miserable births by sinful deeds.

18. రమణీయచరణాః యత్తేరమణీయాంయోని మాప

ద్యేరన్ ......కపూయచరణాః యత్తే కపూయాం యోని మాపద్యేరన్ శ్వయోనిం వా సూకరయోనిం వా.

ఛాందోగ్య పంచమ ప్రపాఠకము. దశమఖండము 7.

అట్టివారు పుణ్యకర్మలు చేసినవారైన యెడల మంచి యోనులలో పుట్టుదురు. (మంచి జన్మలు పొందుదురు.) వారు కుత్సితకర్మ గలవారైన యెడల శునకసూకరములవంటి నీచ యోనులయందు పుట్టుదురు (నీచజన్మలెత్తుదురు.)

If they have done good acts, they are born in good wombs i.e., take to good births. If they have done evil deeds, they are born in miserable wombs i. e., take to miserable births like dogs and pigs.

19. స్థూలాని సూక్ష్మాణి బహూనిచైవ
రూపాణి దేహీస్వగుణై ర్వృణోతి
క్రియాగుణై రాత్మగుణైశ్చ తేషాం
సంయోగహేతు రపరోఽపి దృష్టః.

శ్వేతాశ్వతర అ. 5.12.

తన గుణములనుబట్టి కార్యములనుబట్టి మనఃస్థితినిబట్టి జీవాత్మ అనేక స్థూల సూక్ష్మరూపములైన శరీరములను పొందుచున్నది. ఈ కలయికకు కారణము మాత్రము మరియొక చోట కానగును. (ఈశ్వరునియొక్క శాసనమువలన)

The individual soul (embodied self) takes to many forms, gross and subtle, based on the qualities belonging to himself, to his actions and to his mental condition. The cause of their combination is found to be still another (Paramapurusha).

29. తస్యహైతస్య హృదయస్యాగ్రం ప్రద్యోతతే; తేన ప్రద్యోతేనైవ ఆత్మా నిష్క్రామతి - చక్షుష్టోవా,

మూర్ధ్నోవా, అన్యేభ్యోవా శరీర దేశేభ్యః, తముత్క్రామన్తం ప్రాణోఽనుత్క్రామతి; ప్రాణ మనుత్క్రామన్తం సర్వే ప్రాణా అనూత్క్రామన్తి; సవిజ్ఞానో భవతి, సవిజ్ఞాన మేవాన్వవక్రామతి, తం విద్యాకర్మణీ సమన్వారభేతే పూర్వ ప్రజ్ఞాచ.

బృహదారణ్యక 4-4-2.

తేజోవంతమైన హృదయాగ్రమునుండి జీవాత్మ శరీరముయొక్క కంటినుండిగాని, శిరస్సునుండిగాని, శరీరముయొక్క ఇతర భాగమునుండిగాని, బయటికి వెడలిపోవును. జీవాత్మ శరీరమును విడిచి వెళ్ళునపుడు దానితోకూడ ముఖ్యప్రాణము ఇతర ప్రాణములు పోవును. అప్పుడు జీవాత్మ అహంకార మమకారములతో వెళ్ళును. ఆ అహంకార మమకారములకు అనుకూలమైన నూతన శరీరములో జీవాత్మ ప్రవేశించును. జ్ఞానము, కర్మ, వెనుకటి అనుభవము జీవునితో కూడ పోవును.

The individual soul departs from that brightened top through the eye or head or through any other part of the body. When it departs, the vital force follows; when the vital force departs, all the other praanas follow. Then the individual soul has particular consciousness and goes to the body which is related to that consciousness. It is followed by kuowledge, work and past experience.

21. అజామేకాం లోహిత శుక్ల కృష్ణాం
బహ్వీః ప్రజాం సృజమానాం సరూపః
అజోహ్యేకో జుషమాణోఽనుశేతే
జహాత్యేనాం భుక్తభోగా మజోఽన్యః.

శ్వేతాశ్వతర 4-5.

ఒక స్త్రీ కలదు. ఆమె ఎరుపు తెలుపు నలుపు మొదలయిన వివిధరంగుల మోహన స్వరూపము గలిగి తనవంటి పిల్లలనే లెక్క లేనంతమందిని కనుచున్నది. ఆమె కూడ అనాదియైనది. ఆమెయే ప్రకృతి, లేక మాయ. ఆమె ప్రక్కన ఆమెయొక్క మోహజాలములో పడి, ఒక అనాది పురుషుడు బద్ధుడై పడియున్నాడు. ఈయన బద్ధుడైన జీవాత్మ. మరియొక అనాది పురుషుడు ఆమె అనేకులచే ననుభవింపబడుటను చూచి వదలివేసినాడు. ఆయన ముక్త జీవుడు.

There is a single Female (Prakriti or Maya) of red white and black colours who is unoriginated and produces numerous offsprings resembling hersslf. By her side lies one unborn Male (the individual soul in bondage) being attached to her, while another Male (the freed individual soul) also un-originated, forsakes her seeing her enjoyed by many.

22. అనీశశ్చాత్మా బధ్యతే భోక్తృభావాత్
జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః.

శ్వేతాశ్వతర, అ. 1-8.

జీవాత్మ పరమాత్మను తెలిసికొనన నంతకాలము అనశ్వరములైన ప్రాపంచిక సుఖదుఃఖములకు బద్ధుడై యుండును. చావు పుట్టుకల చక్రములో పడి కొట్టుకొనుచుండును. ఎప్పుడైతే జీవాత్మ పరమాత్మను తెలిసికొనునో, అపుడు ఈ సంకెళ్ళన్నింటి నుండి విముక్తి చెంది, శాశ్వతానందమును పొందును.

As long as the Individual Soul does not realise the Lord (the Supreme Soul) it gets bound to wordly ephemeral pleasures and sorrows and is subject to the cycle of births and

deaths. When it realises Him, it becomes free from all fetters and enjoys eternal Bliss.

23. ఏష సంప్రసాదోఽస్మాచ్ఛరీరా త్సముత్థాయ
పరంజ్యోతి రుపసమ్పద్య స్వేన రూపేణాభినిష్పద్యతే.
ఛాందోగ్య. అష్టమ ప్రపాఠకం. ద్వాదశ. 2

విముక్తుడైన జీవుడు శరీరమునుండి వెడలిన పిమ్మట పరమాత్మను బొంది స్వస్వరూపముతో గూడినవా డగుచున్నాడు.

The freed Individual soul as soon as he leaves this body attains the Supreme soul and shines in his original blissful nature.

[సూరా:—యావదధికార మవస్థితి రాధికారికాణాం.
బ్రహ్మసూత్రములు 3—3—32.

ఈ పరిపూర్ణత్వమును చెంది విముక్తులైన జీవాత్మలు భగవన్నియమితమైన ధర్మసంస్థాపనకార్యమును నెరవేర్చు నిమిత్తము - ఆ మహాకార్యము పూర్తియగువరకును, పునర్జన్మము నెత్తవచ్చును. (బౌద్ధమతములో బోధిసత్త్వులను గూర్చి గూడ నిటులనే చెప్పబడియున్నది.)]

51



# అయిదవ పాఠము

## పరమాత్మను పొందుట

## (Realisation of God)

1. అథ యత్తపో దాన మార్జవ
మహింసా సత్యవచన మితి
తా అస్య దక్షిణాః

ఛాందోగ్య. తృ. సప్తదశ. 4.

తపస్సు, త్యాగము, అందరియందును సమభావము, అహింస, సత్యము, అనునవియే ఈ యజ్ఞమునకు దక్షిణలు.

Tapas (concentrated meditation) self-sacrifice, treating all alike, non-voilence and truth are the only offerings in this Yagna.

[వరా:—అహింసా వ్రతములో దౌర్జన్యరాహిత్యము, సర్వభూతములయందును ప్రేమ, సర్వమానవ సోదరత్వము ఇమిడియున్నవి. భగవంతుని పేరే సత్యమనియు, సత్యమే ధర్మమనియు, పై 3 పాఠములో చదివియున్నాము. గావున సత్యములో ఈశ్వరారాధనము, ధర్మప్రవర్తన ఇమిడియున్నవి. పరమాత్మను పొందుటకొరకు చేయబడు త్యాగమయమైన జీవితమే ఈ మహాయజ్ఞము. ఇంద్రాదిదేవతల అనుగ్రహము పొంది స్వల్పసుఖములను సంపాదించుటకై, పశ్వాదులను చంపి యజ్ఞయాగాదులను గావించుట హీనమైనదని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. (ముణ్డక. ప్ర. ద్వి. 7) ఉపనిషత్తుల ప్రకారము యజ్ఞమనగా త్యాగము. పరమాత్మయొక్క ప్రీత్యర్థము మాతృదేశము యొక్కయు, మానవకోటి యొక్కయు

సేవలో సంపూర్ణ త్యాగము గావించు జీవితమును నడపుట, ధర్మస్వరూపుడగు పరమేశ్వరునియొక్క యుద్దేశ్యమైన ధర్మ సంస్థాపన కార్యములో ఆత్మార్పణము గావించుట, ఈ మహా యజ్ఞము. ఈ మహాయజ్ఞమునకు దక్షిణలు అనగా సాధన ములు ఈ సుప్రసిద్ధ మంత్రములో చెప్పబడియున్నవి. ఈ దక్షి ణలు సమర్పించి అనగా ఈ సాధనములను ఉపయోగించి ఈ మహాయజ్ఞమును గావింపవలె ననునదియే, భరతవర్షము నాడును నేడును మానవకోటికి ఇచ్చుచున్న సందేశము. ఈ మంత్రములోని ధర్మములను నవీన కాలమున మహాత్మా గాంధి తన జీవితధర్మముగను తాను తలపెట్టిన యుద్యమము కన్నిటికిని సాధనములుగను అవలంబించియున్నాడు. ఈ మహా యజ్ఞమైన ధర్మసంస్థాపనను గూర్చి పై 3 వ పాఠముయొక్క 28 నెంబరు మంత్రముక్రింద వ్రాయబడిన షరాను చూడుము.]

2\. హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖం
తత్త్వం పూషన్నపావృణు సత్యధర్మాయ దృష్టయే.

ఈశావాస్య. 15

సత్యముయొక్క ముఖము బంగారు పాత్రచే మూయ బడినది. ఓ ప్రభువా! సత్యధర్మములకే బద్ధకంకణుడైన నేను సత్యమును ధర్మమును బాగుగా చూచుటకుగాను నా కొరకు ఆ పాత్రను తీసివేసి దానిని తెరచుము.

The face of Truth is covered by a golden lid. O Lord, the opener, I pray, remove the lid and open it for me who is devoted to truth and Dharma so that I may behold it.

[షరా:—పరమాత్మకు సత్యమని పేరనియు, ధర్మము

ఆయన యొక్క స్వరూపమనియు, ధర్మమనగా సత్యమే ననియు పై మూడవ పాఠములో చదివియున్నాము.]

3. సత్యేన లభ్యస్తపసా హ్యేష ఆత్మా
సమ్యగ్ జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యం
ముణ్డక. తృ. ప్ర. 5.

ఆపరమాత్మ సత్యము చేతను తపస్సు చేతను, సరియైన యదార్థ జ్ఞానము చేతను, బ్రహ్మచర్యము చేతను ఎల్లప్పుడు లభ్యుడు.

God is always attainable by Truth, Thapas (concentrated meditation) true knowledge of God and a disciplined life of absolute purity.

4. తేషామేవైష బ్రహ్మలోకో యేషాం తపో బ్రహ్మచర్యం
యేషు సత్యం ప్రతిష్ఠితమ్. ప్రశ్న. ప్రథమ. 15.

ఎవరికి తపస్సు, బ్రహ్మచర్యము గలవో, ఎవరియందు సత్యము స్థిరముగా నిలిచియున్నదో, అట్టివారికే పరమపదము కలుగును.

Whosoever performs Thapas (Concentrated meditation) and Brahmacharya (a disciplined life of absolute purity) and in whomsoever truth is firmly planted, they alone attain eternal Bliss.

5. తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా విద్యయా
ఽఽత్మాన మన్విష్యా. ప్రశ్న. ప్రథమ. 10.

తపస్సుచేతను, బ్రహ్మచర్యముచేతను, శ్రద్ధచేతను జ్ఞానము చేతను పరమాత్మను ఉపాసించవలెను.

One should worship God by Thapas (concentrated meditation) Brahmacharya (a disciplined 'life of absolute purity,) devotion and true knowledge.

6. అథ యద్యజ్ఞ ఇత్యాచక్షతే బ్రహ్మచర్యమేవ
తద్బ్రహ్మచర్యేణ హ్యేవ యో జ్ఞాతా తం విన్దతే.

ఛాందోగ్య. అష్టమ. పంచ 1.

దేనిని యజ్ఞ మని (త్యాగమయమైన జీవిత మని) చెప్పుదురో, అది బ్రహ్మచర్యము వలననే సాధ్యమైనది. బ్రహ్మచర్యముచేత ఎవడైతే పరమాత్మను తెలిసికొనునో వాడు ఆ పరమాత్మను పొందును.

What is callsd yagna (a life of sacrifice) can only be possible by the observance of Brahmacharya. Whosoever realises Godby Brahmacharya, he attains Him.

[పరా:—పై న 1 రు మంత్రమువలెనే, ఈ న 6 రు మంత్రముకూడ త్యాగమయమైన జీవితమునే యజ్ఞమని చెప్పుచున్నది. ఆ మంత్రములో ఆ యజ్ఞమునకు సమర్పించవలసిన దక్షిణలను గూర్చి చెప్పినది. ఈ మంత్రములో నా యజ్ఞమునకు కావలసిన (నిష్ఠ) జీవిత శిక్షణమును గూర్చి చెప్పబడుచున్నది. దానిని బాగుగా జరుపుటకు బ్రహ్మచర్యవ్రతానుష్ఠాన మావశ్యకము. సృష్టిని చేయుటలో ఈశ్వరోద్దేశ్యమైన ధర్మ సంస్థాపన కొరకు, త్యాగమయ మైన జీవితమును నడుపుట యజ్ఞము. మాతృదేశము యొక్కయు, మానవజాతియొక్కయు కష్టనివారణ కొరకు కృషి సలుపుట, ధర్మస్థాపనమై యున్నది.

బ్రహ్మచర్యవ్రతము విద్యార్థిదశయగు బ్రహ్మచర్యాశ్రమములో ప్రారంభమై పిమ్మట మానవుని యావజ్జీవితము

నందును అనుష్ఠించబడు ధర్మమైయున్నది. బ్రహ్మచర్యాశ్రమము, గృహస్థాశ్రమము, వానప్రస్థ, సన్యాసాశ్రమములు అన్నియు మోక్షమునకు సాధనములేనని ఛాందోగ్యోపనిషత్తు, ద్వితీయ ప్రపాఠక, త్రయోవింశ ఖండ, నె 1 రు మంత్రములో చెప్పబడియున్నది. గార్గి యను ఆమె, యావజ్జీవము బ్రహ్మచారిణిగనే యుండి జీవన్ముక్తురాలయ్యెను. జనకమహారాజు గృహస్థాశ్రమమును, రాజ్యమును, వదలకుండగనే జీవన్ముక్తుడయ్యెను. యాజ్ఞవల్క్యుడు కొంత కాలమునకు సంసారమును త్యజించి, సన్యాసాశ్రమమును స్వీకరించి ముక్తి నొందెను. జీవన్ముక్తి అనగా ఈ జీవితములోనే మోక్షదశ ననుభవించుట. తర్వాత తక్కిన ఆశ్రమముల నవలంబించినను, అవలంబించకున్నను, ప్రతి బాలుడును బాలికయు బ్రహ్మచర్యాశ్రమము నవలంబింపక తప్పదు. ఈ బ్రహ్మచర్యాశ్రమ విద్యావిధానము ప్రాచీనకాలమున భరత వర్షమును గొప్ప వీర్యవంతమైన తేజోవంతమైన ధర్మభూయిష్ఠమైన, ధనధాన్య సమృద్ధిచే కళకళ లాడుచుండిన ఐహికాముష్మిక ప్రదమైన అత్యుత్కృష్టమైన గొప్ప నాగరికత గల జాతిగ గావించిన జాతీయ ప్రతిష్ఠాపనము.

ప్రతిబాలునికిని, బాలికకును కూడ సాధారణముగా ఎనిమిదవ సంవత్సరమున (కొన్నివేళల అయిదవ సంవత్సరములోకూడ) ఉపనయన సంస్కారమును చేసి గాయత్రి మంత్రము నుపదేశముచేసి, విద్యాభ్యాసమును ప్రారంభింతురు. ఆవెంటనే, బాలుడు గురుకులాశ్రమమునకుబోయి అచటనే నివసించుచు 25 లేక 36 సంవత్సరములు వెళ్ళువరకును ఆచా

ర్యులవద్ద విద్య నభ్యసింపవలెను. ఇంటియం దుండరాదు. ఆడ పిల్లలకు 16 లేక, 18 సంవత్సరములు వెళ్ళువరకును వివాహ మగువరకును బ్రహ్మచర్యాశ్రమ పద్ధతినే విద్యగరవుచుండిరి. ఆడపిల్లలకును, మగపిల్లలకును, గురుకులాశ్రమములు వేరు వేరుగ నుండెను. ఆడపిల్లలకు ప్రత్యేక గురుకులాశ్రమములు లేనిచోట్ల తమ గృహములయందే విద్య నభ్యసించుచు, బ్రహ్మ చర్యాశ్రమమును నడుపు చుండిరి. తల్లి తండ్రులే ఆమెకు కావలసిన శిక్షణము నిచ్చిరి. వారికి స్నేహితుడైన లేక స్నేహితురాలైన మరియొక గురువుయొక్క సహాయము ఆమెకు లభించును. ప్రతి విద్యార్థియు, విద్యార్థినియు తెల్ల వారుఝామున నిద్రనుండి లేవవలెను. కాలకృత్యములు దీర్చు కొని స్నాన మాచరించి, నిష్ఠగా కూర్చొని, గాయత్రీ మంత్ర మును సూర్యోదయమగువరకును ఉపాసించవలెను. హోమము చేయవలెను. ప్రాణాయామముకూడ నాచరించవలెను. ప్రాణాయామము ఆరోగ్యమునకు బుద్ధివికాసమునకు చాల సహాయకారి. ఇటులనే సాయంత్రము కూర్చొని సూర్యాస్త మయమయి నక్షత్రములు కనుపడువరకును, గాయత్రీ మంత్ర మును ఉపాసించవలెను. ప్రాణాయామమును కూడ చేయ వలెను. గాయత్రీ మంత్రము మిగుల నుత్కృష్టమైనది. దాని ప్రాశస్త్యమును వర్ణించుచు నవీనభారత సంస్కర్తయగు శ్రీ రాజా రామమోహనరాయలవారు కూడ ప్రత్యేకముగ వ్రాసినారు. గాయత్రీ మంత్ర మిది.

ఓం, భూ ర్భువ స్సువః, తత్, సవితుః, వరేణ్యం
భర్గో, దేవస్య, ధీమహి, ధియో, యోనః ప్రచోదయాత్ ఓం॥

దీనియర్థమేమనగా "సర్వలోకములకు ప్రభువు, జ్ఞాన స్వరూపుడు, తేజస్సునకు స్థానము, సమస్త లోకములకు ఆశ్రయము, పాపరహితుడు, మంగళకరుడు నగు పరమాత్మను మే ముపాసించుచున్నాము. ఆయన మా బుద్ధిని వికసింపజేసి మాకు జ్ఞానమును ప్రసాదించి మమ్ముల నడిపించును గాక."

ఇది ప్రాచీన భారతవర్షములో ప్రతి బాలుడును బాలికయు పిమ్మట గృహస్థాశ్రమములో ప్రతి పురుషుడు, స్త్రీ కూడ నుపాసించుచుండిన మహామంత్రము. ఇందులో నాకు అన్న వస్త్రముల నిమ్ము నాకు పశువుల నిమ్ము నాకు ధనమునిమ్ము నా శత్రువులను నాశము చేయుము నాకు పుత్రుల నిమ్ము అను మొదలగు స్వల్పకోరికలు లేవు. "నాకు జ్ఞానమును ప్రసాదించి నన్ను ధర్మమార్గమున నడిపించుము" అను ఉత్తమమైన కోరికమాత్రమే కలదు. ఇదియే భారతీయ జాతీయ ప్రార్థన. మానవకోటియొక్క నైతికాభివృద్ధిలో (Moral evolution) గొప్ప పై మెట్టు.

బ్రహ్మచర్యాశ్రమ మనుష్ఠించబడు ఆశ్రమము ఏ గ్రామమునకును మూడుమైళ్ళకంటె సమీపమున నుండరాదు. ఇంక నెక్కువదూరమున నుండవచ్చును. ఇవి (Residential Universities) విద్యార్థులు, ఆచార్యులు, కాపురముండి విద్యాభ్యాసము నొందు విశ్వవిద్యాలయములు. ఇచట విద్యార్థులను సమస్త విద్యాపారంగతులను చేయవలెననియే ఆశయము. ప్రతివిద్యార్థి పదునెనిమిది సంవత్సరముల కాలమువరకు రోజుకు ఇరువదినాలుగు గంటలు ఆశ్రమములోనుండి విద్య నభ్యసించినపుడు ఎన్ని విద్యలనైన సంపాదించగలడు. విద్యార్థి

దశలో తన శరీరమును సుఖపెట్టుకోవలెనని కోరగూడదు. ఉదయముననే చన్నీళ్లస్నానము చేయవలెను. ప్రాణాయామము, పిమ్మట శరీరపరిశ్రమ చేయవలెను. అడవికిపోయి సమిధలు తెచ్చుకోవలెను. చాపమీద పరుండవలెనే కాని మెత్తని పక్కమీద పరుండరాదు. పేదరికమును స్వీకరించిన బ్రాహ్మణులయొక్క పిల్లలయినను, రాజకుమారులైనను, ధనవంతులయిన వర్తకుల బాలురయినను, పారిశ్రామికుల వ్యవసాయకుల, కార్మికుల పిల్లలయినను ఒకేచోటనివసించి, ఒకే విధమైన శరీరమునకు సుఖమునుకోరని జీవితమును గడపవలెను. ఈవిద్యఅంతయు ఉచితముగ నివ్వబడుచుండెను. వివిధ విషయములను బోధించుటకు పెక్కుమంది ఆచార్యులుండిరి. సాధారణముగా ప్రతి ఆచార్యుడును చాల విద్యలలో నిపుణుడు గనే యుండెను. విద్య ముగించి ప్రధానాచార్యునొద్ద (Certificate) శిక్షణ జయప్రదముగా ముగించినటుల పత్రము నుపొంది, గృహమున కేగునపుడు ప్రతి విద్యార్థి తన కుటుంబ శక్తికొలది గురు దక్షిణను సమర్పించి పోవుచుండెను.

ఆనియమములో ప్రతి విద్యార్థి అత్యంతమైన నైతిక శిక్షణమును పొందెను. స్త్రీలతో కలిసి మెలసి యుండరాదు. వారితో నవ్వులాటలు, కేళింతలు, సరససల్లాపములు కూడదు. అందరు స్త్రీలను తల్లులవలె బహుమర్యాదగాను, పవిత్రముగానుచూడవలెను. కామోద్రేకము వలన ఇంద్రియము పడిపోయినచో అదివరకు జరిపిన బ్రహ్మచర్యవ్రత మంతయు వ్యర్థమగును. మరల బ్రహ్మచర్యవ్రతమును ప్రారంభించవలెను. మాంసాహారముకూడదు. ప్రస్తుత నవనాగరికులగు విద్యార్థు

లుపయోగించుచున్నటుల చుట్టలు, బీడీలు, సిగరెట్లు, నస్యము మొదలగు వాటిని ఆ కాలపు విద్యార్థులు ఎరుగనే ఎరుగరు. అప్పటి విద్యార్థి హృదయ పారిశుద్ధ్యము కలిగి జితేంద్రియుడై భక్తి జ్ఞాన వైరాగ్యముల నభ్యసించి, గొప్ప ఆధ్యాత్మిక సంపన్నుడయ్యెను. విద్యార్థికి త్యాగము, సేవ ఈ రెండు జీవితపరమావధిగ నేర్పబడెను. విద్యా విధానవిషయములో, (1) వేదాధ్యయనము — దీనితో నిరుక్తము, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు (కవిత్వము) అను భాషావిషయిక జ్ఞానము; (2) వేదాంతశాస్త్రము—ఉపనిషత్తులు మొదలగునవి, తర్కశాస్త్రము (Logic) మానసికశాస్త్రము (Psychology) (3) ఆయుర్వేదము—శరీరశాస్త్రము, జంతు, వృక్ష, ప్రకృతి శాస్త్రములు (4) జ్యోతిశ్శాస్త్రము, గణితశాస్త్రము, రేఖాగణితము, భూగోళశాస్త్రము, భూగర్భశాస్త్రము (5) ధనుర్వేదము — సైనిక శిక్షణము (6) శిల్పవేదము — ఇంజనీయరింగు, శిల్పము, చిత్తరువులు, (7) అర్థశాస్త్రము — ఆర్థిక రాజకీయశాస్త్రము, ప్రభుత్వవిధానము (8) ధర్మశాస్త్రము — నీతి చట్టములు (Law) సాంఘికశాస్త్రము (Sociology) కుటుంబమునకు సంఘమునకు దేశమునకు విధులు మొదలగునవి. (9) గాంధర్వవేదము — సామవేదము మొదలగు సంగీత శాస్త్రము. (10) వృత్తివిద్యలు — వ్యవసాయము, తోటలు వేయుట, పరిశ్రమలు, చేతిపనులు, వర్తకవ్యాపార విద్యలు.

ఈ విద్యలన్నియు ఆ ఆశ్రమములలో నేర్పబడుచుండెననియు విద్యార్థి ఆశ్రమమును వదలివచ్చుటకు ముందుగా

కామశాస్త్రము (Sexual Sceince) అనగా భార్యతో ధర్మముగాను, సౌఖ్యముగాను ఎటుల ప్రవర్తింపవలెనో, మంచి పుత్రులను పుత్రికలను కని యెటుల పెంచవలెనో, దానినికూడ నేర్పి పంపిరనియు, శ్రీ దయానంద సరస్వతి స్వాములవారు తమ సత్యార్థప్రకాశికలో వ్రాసియున్నారు. మనుస్మృతిలో కూడ నిటులనే చెప్పబడినది. అయితే విద్యార్థులకును, విద్యార్థినులకును విద్యావిధానములో కొంత భేదముండెను. అంతేగాక, ఏవిద్యార్థికి జీవితములో ఏవిద్యలు ఏవృత్తివిద్యలు ఎక్కువ అవసరములో వాటి నెక్కువ నేర్పుచుండిరి. ధర్మము, సత్యము, తపస్సు, ఇంద్రియ నిగ్రహము హృదయపారిశుద్ధ్యములతో బాటు "మానుషంచ స్వాధ్యాయ ప్రవచనేచ" అనగా ఐహికవిద్యలను సంఘమునకు దేశమునకు మానవజాతికి చేయవలసిన సేవావిద్యలను కూడ నేర్చుకొని ఆచరించుచు ఇతరులకు బోధింపుము అనియు, "ప్రజాచ, ప్రజనశ్చ ప్రజాతిశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ" అనగ ధర్మపత్నికి, మంచి పిల్లలను కనుటకు పెంచుటకు, కుటుంబ సుఖమునకు, సంబంధించిన ధర్మములను కూడ నేర్చుకొని ఆచరించుము, ఇతరులకు బోధింపుము" అనియు తైత్తిరీయోపనిషత్తు, శిక్షావల్లి, అనువాకము, నవమ మంత్రములో శాసించబడినది.

ఇంకొక ముఖ్యమైన విషయమునుగూర్చి చెప్పి ఈ బ్రహ్మచర్యాశ్రమమును గూర్చిన షరాను ముగించెదను. ఉపనిషత్తుల కాలము తరువాత చాల శతాబ్దములవరకును ఈ శిక్షణమంతయు పురుషులతోబాటు స్త్రీలకును (బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్ర విభేదములు లేకుండా ఆర్యధర్మము

క్రింద చేరిన యావత్తు భారతజాతికిని యివ్వబడినది. యజుర్వేదము 26-2 వ మంత్రములో స్పష్టముగా "బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులందరును, స్త్రీలును, అందరు మానవులును వేదముల నభ్యసించి యితరులకు బోధించవలెను" అని స్పష్టముగా నున్నది. ఇటులనే అథర్వణవేదము 11-16-3, 18మంత్రములలో బాలురు బ్రహ్మచర్య విధానమును అనుష్ఠించి, విద్యలు నేర్చుకొని, పిమ్మట నెటుల తమ ఇచ్ఛవచ్చిన మంచి ఆడపిల్లలను వివాహమాడవలెనో, అటులనే బాలికలుగూడ బ్రహ్మచర్య విధాన ప్రకారము వేదములను ఇతర విద్యలను అభ్యసించి పిమ్మట తమ ఇచ్ఛవచ్చిన యోగ్యులైన విద్యావంతులైన పురుషులను వివాహమాడవలెను అని చెప్పబడినది. శ్రౌత సూత్రములలో భార్య యజ్ఞకాలమున మంత్రములను చెప్పవలెను అని యున్నది. ఈపై మంత్రములను శ్రీ దయానంద సరస్వతీ స్వాములవారు తమ సత్యార్థప్రకాశికలో వ్రాసియున్నారు. అనార్యులైన రావణాసురుడును లంకలోని రాక్షసులును, వేద పారాయణము చేయుచుండిరని వాల్మీకి రామాయణములో చెప్పబడియున్నది.

కాని చాల శతాబ్దములకు పిమ్మట చాలమంది వేదాధ్యయనము చేయుటను మానివేసినారు. అటుల వేదాధ్యయనము చేయనివారి నందరిని శూద్రులుగ చేసినారు. పిమ్మట శూద్రులు స్త్రీలు వేదములు చదువుట కధికారము లేదని వ్రాసినారు. కాని వేదాంత విజ్ఞానముపొందుటకును, మోక్షము పొందుటకును, శూద్రత్వము స్త్రీత్వము అడ్డురాదనియే వ్రాసి

నారు. స్త్రీలకును శూద్రులకును వేదములలోని జ్ఞానము నిచ్చుటకే శ్రీ మహాభారతము, శ్రీమద్భాగవతము పుట్టిన వన్నారు. శ్రీమహాభారతమునకు పంచమ వేదమని పేరుపెట్టి నారు. వేదవిద్యయందు శ్రద్ధగల శూద్రులు ద్విజులగుట, ద్విజులు శూద్రులుగ చేయబడుట జరుగుచుండెను. పుట్టుకను బట్టిగాక గుణకర్మలను బట్టియే వర్ణవ్యవస్థ జరుగుచుండెడిదని శ్రీమద్భాగవతములో వ్రాయబడినది. అప్పటి కాలమునకు స్త్రీలు శూద్రులు వేదము చదువుటలేదు. కాని వేదాంత విజ్ఞానమును శౌనకాది మహాఋషులకు కలుగచేయుటకు శ్రీమద్భాగవతము మొదలగు పురాణములను చెప్పినవాడు శూద్రుడగు సూతమహర్షియే. శ్రీమద్భాగవత సప్తమస్కంధ ములో ధర్మరాజునకు నారదుడు ఈ క్రిందివి సర్వవర్ణముల ధర్మములై యున్నవని బోధించెను:—

"సకల వర్ణంబుల జనులకు సత్యంబును, (Truth) దయ యును, (Love) నుపవాసాది తపంబును, (Thapas) శౌచం బును, స్థైరణయు, సదసద్వివేకంబును, మనోనియమంబును, బహిరింద్రియ జయంబును, (Self control) హింసలేమియు, (Nonviolence) బ్రహ్మచర్యంబును, (Brahmacharya) దానంబును, (Self sacrifice) యథోచిత జపంబును, సంతో షంబును, మార్దవంబును సమదర్శనంబును (Human equality) మహాజన సేవయు, (Service to country and humanity) గ్రామ్యంబులయిన కోరికలు మానుటయు, నిష్ఫలక్రియలు విడుచుటయు, మితభాషిత్వంబును, దేహంబుగాని తన్ను వెదకి కొనుటయు, నన్నోదకంబులు ప్రాణులకుం బంచియిచ్చుటయు,

బ్రాహ్మణులందు దేవతాబుద్ధియు నాత్మబుద్ధిం జేయుటయు, (Love all as part of God and as one's own self) శ్రీనారాయణ చరణ స్మరణ కీర్తన శ్రవణ సేవార్చన నమస్కార దాస్యాత్మ సమర్పణా సఖ్యంబు లనియెడి త్రింశల్లక్షణంబులు గలుగవలయు."

దీనినిబట్టి బ్రహ్మచర్యము, మానవసేవ, దేశసేవ, ఆత్మ సమర్పణము, తపస్సు, త్యాగము, అందరియందును సమభావము, అహింస, సత్యము, భక్తి, జ్ఞాన, వైరాగ్యములు మొదలగు ఉపనిషద్ధర్మము లన్నిటిని అందరు మానవులును అనుష్ఠించి మోక్షమును పొందుట విధియని స్పష్టపడుచున్నది.

కాలక్రమేణ నైతిక పతనము కలిగినది. ఇటీవల దేశములో ప్రసరించిన పాశ్చాత్య నాగరికతా ప్రచండ వాయువుచే బ్రహ్మచర్యము సాంతముగను ఆధ్యాత్మిక జీవితము చాలవరకును కొట్టుకపోయినది. హిందూసంఘములోని బ్రాహ్మణులమని చెప్పుకొనెడివారలలో కూడ వేదము చదువుకొన్న వారిని వేళ్ళమీద లెక్కించవచ్చును. ఆ వేదపండితులు కూడ అర్థము చదువుకోరు. వారి కుమాళ్ళు వేదము చదువరు. ఈ స్థితినిబట్టి మనుస్మృతి ప్రకారము అందరు శూద్రులే అయినారు. ఎవరికిని ద్విజత్వములేదు. అందరు సమానులైనారు. కాని నాడు ఆధ్యాత్మిక నైతికోన్నతిలో అందరు సమానులు. నేడు ఆధ్యాత్మిక నైతిక పతనములో అందరు సమానులు గనుక మిగుల శోచనీయమగు స్థితిలో నున్నాము.

ప్రస్తుత కాలమున మరల ఉత్కృష్టమైన బ్రహ్మచర్యాశ్రమ పద్ధతిని మన భారతీయ యువకులకును, యువతుల

కను విద్యగరపుట ఎట్లు ? మరల మన జాతిని ఉన్నతస్థితికి తెచ్చుట ఎట్లు ? అనునదియే ప్రస్తుత ప్రధాన జాతీయ విద్యా సమస్య. శ్రీ దయానంద సరస్వతీ స్వాములవారు వర్ణభేదములు లేకుండ బాలురకు వేరుగను, బాలికలకు వేరుగను, గురుకులాశ్రమములను స్థాపించి బ్రహ్మచర్యాశ్రమ పద్ధతినే విద్యను గరపుటకు ఏర్పాటు చేసినారు. శ్రీ వివేకానంద స్వామివారు "మరల గురుకులవాసమున మన బాలురును, బాలికలును విద్యాభ్యాసముచేసి బ్రహ్మచర్యాశ్రమమును నడుపుట అత్యవసరమై యున్నది. విద్యావిధానములో ప్రస్తుత కాలమున కవసరమైన మార్పులను చేసికొనవచ్చును. ప్రస్తుత ప్రపంచ ప్రకృతిశాస్త్ర విజ్ఞానమును కూడ మనము తీసికొనవలెను. ఇంగ్లీషుభాషను కూడ మన పిల్లలకు నేర్పవచ్చును. ఇపుడు విశ్వవిద్యాలయములలో గుమాస్తాలుగ పనికివచ్చు విద్యను మాత్రమిచ్చుచున్నారు. దానివలన ప్రయోజనమేమియు లేదు. భోజన సంపాదనకు అవసరమైన వృత్తి విద్యలనుకూడ మనము నేర్పవలెను. దేశములోని అందరి జనులలోను సరియైన విద్యావ్యాపకము చేయవలెను. విద్యార్థుల యొక్కయు విద్యార్థినుల యొక్కయు శారీర మానసిక పటిమతోపాటు నైతిక ఆధ్యాత్మిక తేజస్సునుకూడ కలుగచేయవలెను. అప్పుడే భారతజాతి ప్రపంచములోని స్వతంత్ర జాతులలో ఉత్తమ స్థానమును పొందగలదు." అని చెప్పియున్నారు. ఇకముందు మనము స్థాపించెడి జాతీయ విద్యావిధానము సమస్త వర్ణముల వారికిని హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ భేదములేక అందరు భారతీయులకును వినియోగపడునదై యుండ

వలెను. భారతజాతిఅంతయు పైకి లేవవలెను. కావున మన దేశనాయకులును, విద్యావంతులును, జాతీయ విద్యాశాలల యజమానులును ఎటుల బ్రహ్మచర్యమును భారతీయ యువ జనులలో స్థాపించవలెనో మిగుల అత్రితతోను, శ్రిద్ధతోను ఆలోచించవలసి యున్నది.]

**7.** అహం వృక్షస్యరేరివా ఊర్ధ్వపవిత్రో వాజినీవ స్వమృతమస్మి. తైత్తిరీయ. శిక్ష. దశమ.

నాయొక్క అహం అనెడి (అహంకారమనెడి) వృక్షమును నశింపచేయువాడను అగుదునుగాక! నేను మిక్కిలి పవిత్రుడనై భోక్తయగు పరమాత్మకు అనుభవనీయ మగువాడను అగుదును గాక! (నేను మిక్కిలి పవిత్రుడనై ధర్మస్వరూపుడగు పరమాత్మ సృష్టిచేయుటలోగల ఉద్దేశ్యమగు ధర్మసంస్థాపన యజ్ఞములో సమిథను అగుదునుగాక! అనగ భగవంతునికి సంపూర్ణముగ ఆత్మార్పణము గావించెదను గాక!)

May I destroy the tree of my own Aham (self-importance) May I become absolutely pure and renounce myself completely in the cause of God (which is the establishment of Dharma) May I become a worthy instrument in His hands or a worthy offering for that great yagn (sacrifice).

[వ రా:—ఈ గొప్పమంత్రిమున కిది శ్రీ రామానుజాచార్యులవారు (విశిష్టాద్వైత స్థాపకులు) గావించిన అర్థము.]

8. య స్త్వవిజ్ఞానవా న్భవత్యమనస్క స్సదాఽశుచిః
న స తత్పద మాప్నోతి సగ్ంసారం చాధిగచ్ఛతి.
కఠ. ప్ర. తృ. 7.

ఎవడు ఎల్లప్పుడు అశుచియై స్వాధీనపడని మనస్సు కలవాడగునో వాడు జ్ఞానహీను డగును. వాడు ఆ పరమపదమును పొందడు. దుఃఖపూరితమైన సంసారమునే పొందును.

Whosoever is always impure and has no control over his mind, he becomes devoid of true knowledge. He cannot attain Bliss. He is only immersed in grief.

9. యస్తు విజ్ఞానవాన్భవతి, సమనస్కః సదా శుచిః
సతు తత్పద మాప్నోతి, యస్మా ద్భూయో నజాయతే
కఠ. ప్ర. తృ. 8.

ఎవడైతే యెల్లప్పుడు పవిత్రుడై వశ్యపడిన మనస్సు కలవాడగునో వాడు జ్ఞానవంతుడగును. ఏది కలిగినయెడల పునర్జన్మము లుండవో అట్టి పరమపదమును వాడు పొందుచున్నాడు.

Whosoever is always pure and self-controlled he alone can attain true knowledge. He can attain that blissful state in which there will be no briths and deaths.

[వరా:—మనఃపారిశుద్ధ్యము, ఇంద్రియ నిగ్రహము, ఈశ్వరునిచేరు ఆధ్యాత్మిక జీవితమునకు ప్రథమ ఆవశ్యకములని ఉపనిషత్తులు చెప్పుచున్నవి.]

10. పరాచః కామా ననుయన్తి బాలా
స్తే మృత్యోర్యన్తి వితతస్య పాశమ్ - కఠ. ద్వి. ప్ర. 2
న సాంపరాయః ప్రతిభాతి బాలం
ప్రమాద్యంతం విత్తమోహేన మూఢమ్
అయం లోకో నాస్తి పర ఇతి మానీ
పునః పున ర్వశ మాపద్యతే మే. - కఠ. ప్ర. ద్వి. 6.

అల్పజ్ఞులు విషయ కామోపభోగములలో నిమగ్నులై అంతటను వ్యాపించియున్న మృత్యుపాశమును పొందుచున్నారు. ధనమోహముయొక్క వలలోపడిన మూఢుడగు అవివేకికి శ్రేయస్సాధనమగు ఉత్తమమార్గము మనస్సునకెక్కదు. అతడు ఈ కనపడుచున్నదే లోకము, ఇంతకన్న మరియొకటిలేదు, అని తలచుచున్నాడు. మరల మరల నా అధీనమును (నరకమును) పొందుచున్నాడు. అని యమధర్మరాజు నచికేతునితో చెప్పెను.

Yama said to Nachiketa:—

(Unwise) Ignorant people are immersed in sensual pleasures and attain chains of Death which is pervading all round. The stupid and ignorant man who is greedy for wealth (whose object in life is only the acquisition of wealth) cannot think of the noble path that leads to Bliss. To him this world is everything and he cannot conceive of anything beyond the pleasures of this world. So he comes again and again under my control i. e. to hell.

11. సర్వే వేదా యత్పద మామనన్తి
తపాగ్ంసి సర్వాణి చ యద్వదన్తి
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి
తత్తేపదగ్ం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్.

కఠ. ప్ర. ద్వి. 15.

సమస్త వేదములు ఎవనిని గమ్యస్థానమని చెప్పుచున్నవో సర్వతపస్సులును ఎవ్వనిగూర్చి చేయబడుచున్నవో బ్రహ్మచర్యవ్రతము లన్నియు ఎవనిని కోరి ఆచరించబడుచున్నవో, ఆ గమ్యస్థానమును గూర్చి నీకు సంగ్రహముగా చెప్పుచున్నాను. ఆపరమాత్మకు "ఓం" అని పేరు.

The goal which all Vedas proclaim, whom all Tapas leads to and desiring whom all Brahmacharya is observed—I tell briefly to you that He is "Om".

12. ప్రణవో ధనుశ్శరో హ్యాత్మా
బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే.

ముణ్డక. ద్వి. ద్వి. 4

ఓమిత్యేవం ధ్యాయథాత్మానం
స్వస్తి వః పారాయ తమసః పరస్తాత్.

ముణ్డక. ద్వి. ద్వి. 6.

(ప్రణవము) ఓంకారము ధనుస్సు, జీవుడే బాణము, పరబ్రహ్మమే లక్ష్యము, అని చెప్పబడుచున్నది.

అంధకారమున కావలి యొడ్డున నున్న గమ్యస్థానమును చేరుటకు గాను పరమాత్మను "ఓం" అని ధ్యానముచేయుడు. మీకు సమస్త శుభములు కలుగును.

[Pranava] "Om" is said to be the bow, Jeevaatma [individual soul] is called the arrow and Paramaatma the target.

In order to reach the goal which is on the further shore beyond darkness, meditate on God as "Om". All blessings will be showered on you.

[మరా:—ప్రణవము యొక్క ప్రాధాన్యము మాండూక్యోపనిషత్తులో ప్రత్యేకముగా చెప్పబడినది. ఓం అనునది అకారము, ఉకారము, మకారము, ఈ మూటిని ఏకముచేయు నాదరూపమగు అర్ధమాత్ర, అను నాలుగు పాదములుగలది. "అ" కారము మేలుకొనియున్న జాగ్రదవస్థలో నున్న మానవునికి (జీవాత్మకు) జ్ఞానమునొసంగువాడు, జాగ్రదవస్థకు ప్రభువు. "ఉ" కారము స్వప్నావస్థకు ప్రభువు. జీవునికి

స్వప్నావస్థకు సంబంధించిన జ్ఞానము నొసంగువాడు. "మ" కారము సుషుప్త్యవస్థలో జీవునికి పరమానందము నొసంగు వాడు. "నాదరూపము" సుషుప్తి కానిది, మేల్కొన్నది కానిది, స్వప్నము లేనిదిఅగు (తురీయ) యోగావస్థలో (అత్యంత మైన మనోనిగ్రహముచేసి కేవలము ఈశ్వరునిమీద మనసు నిల్పుటవలన ప్రపంచమును తన శరీరమును మరచిపోవుచుండెడి యోగసమాధిలో) జీవునికి పరమానందము నొసంగువాడు, నగు పరమాత్మయొక్క నాలుగు స్వరూపములు కలిసి "ఓం" అను ప్రణవము అయిన దని ఆ యుపనిషత్తు వర్ణించుచున్నది. అట్టి పరమాత్మ "ప్రపంచోపశమం శాన్తం శివ మద్వైతం" అని చెప్పబడినది అతడే తెలియబడవలసినవాడు. అతనిని వాసుదేవుడని పిలుతురు. సుషుప్త్యవస్థలో జీవుడు తాత్కాలిక ముగా పరబ్రహ్మములో నైక్యము జెంది ఆయనలో విశ్రమిం చుచు బ్రహ్మానందమును అనుభవించుచుండునని బృహదారణ్య కోపనిషత్తులో చెప్పబడియున్నది.]

13. నహోవాచ నవా అరే పత్యుః కామాయ పతిః
ప్రియో భవతి, ఆత్మనస్తు కామాయ
పతిః ప్రియో భవతి; నవా అరే జాయాయై
కామాయ జాయా ప్రియా భవతి, ఆత్మనస్తు
కామాయ జాయాప్రియా భవతి; నవాఅరే
పుత్రాణాం కామాయ పుత్రాః ప్రియా
భవన్తి ఆత్మనస్తుకామాయపుత్రాః ప్రియాభవన్తి;
.........నవా అరే భూతానాం

కామాయ భూతాని ప్రియాణి భవన్తి, ఆత్మ
నస్తు కామాయ భూతాని ప్రియాణి భవన్తి;
.........ఆత్మావా అరే ద్రష్టవ్యః శ్రోత
వ్యో, మంతవ్యో నిధిధ్యాసితవ్యో మైత్రేయి
ఆత్మని ఖల్వారే దృష్టే శ్రుతే మతే విజ్ఞాత
ఇదం సర్వం విదితమ్. బృహదారణ్యక. 4-5-6.

యాజ్ఞవల్క్యుడు తన భార్యయగు మైత్రేయితో నిటుల చెప్పెను. ప్రియురాలా! భార్య భర్తను ప్రేమించుట భర్త కొరకుకాదు. భర్త భార్యను ప్రేమించుట భార్యకొరకు కాదు. తమ ఆత్మోన్నతికై ప్రేమించుచున్నారు. పుత్రులను తల్లి దండ్రులు ప్రేమించుట పుత్రుల కొరకుగాదు. తమ యొక్క ఆత్మోన్నతికొరకై ప్రేమించుచున్నారు. మనము భూతములను ప్రేమించుట వాటి కొరకుగాదు. మన ఆత్మోన్నతికొరకై ప్రేమించుచున్నాము. (మానవుని హృదయములో ప్రేమ అను సద్గుణము నాటబడియున్నది. దానికి దయ అనికూడ పేరు. అతడు తన దారాపుత్రాదులను పొరుగువారిని ప్రేమించుట మూలముగా నా సద్గుణములను వృద్ధి చేసికొననియెడల నైతికపతనము నొందుచున్నాడు. కుటుంబముయొక్కయు, ఇరుగు పొరుగు వారియొక్కయు, ప్రేమ, లోకమును విశ్వ మును ప్రేమించుటను నేర్చుకొనుటకు ముఖ్యమైనమెట్టు. భగ వంతుడు ప్రేమస్వరూపుడు గనుక ఆయనను పొందుటకు మాతృదేశమును మానవకోటిని సమస్తభూతములను విశ్వ మును ప్రేమించుట అవసరమైయున్నది.) నాప్రియురాలైన మైత్రేయి! పరమాత్మను గూర్చి వినవలెను. ధ్యానమనన

ములను చేయవలెను. వినుటవలనను ధ్యానమననముల వలనను ఆయనను తెలిసికొనినపుడు పైన చెప్పబడిన దంతయు పూర్తిగా తెలియును.

Yaagnavalkya said to his wife Maitreyi :—It is not for the sake of the husband, my dear, that he is loved, but for the sake of one's own soul, that he is loved. It is not for the sake of the wife, my dear, that she is loved, but for the sake of one's own soul that she is loved. It is not for the sake of sons, my dear, that they are loved but for the sake of one's own soul that they are loved. It is not for the sake of beings that they are loved but for the sake of one's own soul that they are loved. [If man does not develop the divine virtue of love that is implanted in him by loving his wife, children and neighbours, he becomes degraded. Domestic and neighbourly love is a step in the direction of developing universal love which is necessary for the realisation of God who is love itself]. The supreme self, my dear Maitreyi, should be realised, should be heard of, reflected and meditated upon. When the self is being realised, reflected and meditated upon, all this is known.

[వరా:—ఏకాదశోపనిషత్తులలో కెల్ల బృహదారణ్యకోపనిషత్తు గొప్పదని, శ్రీ శంకరాచార్యులవారు దానికి ప్రత్యేక వ్యాఖ్యానమును వ్రాసినారు. అసలు స్వభావములో జీవేశ్వరుల యేకత్వమునుగూర్చి అది ప్రధానముగ చెప్పినది. కొన్ని శతాబ్దములకు పిమ్మట "నేను నాతండ్రి యొకటే" నని ఏసుక్రీస్తు ప్రభువు చెప్పినాడు. యాజ్ఞవల్క్య మహాఋషి మహావిద్వాంసురాలగు తన భార్యయైన మైత్రేయికిని జీవన్ముక్తుడైన జనక మహారాజునకును జేసిన అద్వైత తత్త్వ బోధయే ఈ ఉపనిషత్తులో ప్రధానభాగము నాక్రమించుచున్నది.]

14. ప్రియ మిత్యేన దుపాసీత.

బృహదారణ్యక, 4-1-3.

ఆయనను 'ప్రేమ' యని (ప్రేమస్వరూపుడుగా) ఉపాసించవలెను.

God should be warshipped as 'Love'.

15. తదేత త్ప్రేయః పుత్రాత్, ప్రేయో విత్తాత్,
ప్రేయోఽన్యస్మా త్సర్వస్మాత్ అన్తరతరం
యదయమాత్మా సయోఽన్యమాత్మనః
ప్రియం బ్రువాణం బ్రూయాత్
ప్రియం రోత్స్యతీతి ఈశ్వరోహ తథైవస్యాత్
ఆత్మాన మేవ ప్రియ ముపాసీత,
స య ఆత్మానమేవ ప్రియ ముపాస్తే
నహాస్యప్రియింప్రమాయుకం భవతి.

బృహదారణ్యక. 2-4-8

పరమాత్మ మనకు పుత్రునికన్న ప్రియమైనవాడు. ధనముకన్న ప్రియమైనవాడు. ఇతరమైన దేనికంటెను ప్రియమైనవాడు. మన హృదయములోపల నున్నాడు. పరమాత్మకంటె దేనినైనను ప్రియముగా నెంచువానితో అన్నిటికంటె పరమాత్మనే ప్రియముగా నెంచువాడు "నీవు ప్రియముగా నెంచునది నాశమగును, అనగా మరణించును" అని చెప్పినచో అటుల చెప్పుట కతనికి అర్హత కలదు. నిజముగా నటుల జరుగును. పరమాత్మనే మిక్కిలి ప్రియతమమైనవానిగా ఉపాసించవలెను. పరమాత్మనే ప్రియమైనవానిగా నుపాసించువానికి ఇతర ప్రియమైనవేమియు మరణించునవి కావు.

The Parabrahma is dearer than a son, dearer than wealth, dearer than everything else and is innermost. Should a person holding Brahman as dearer say to one, calling anything else dearer than Brahman, "what you hold dearer will die" he is certainly competent to say so, it will indeed come true. One should meditate upon Brahman alone as dear. Of him who meditates upon Brahman alone as dear the, dear ones are not mortal.

[పరా:— భక్తుడు భగవంతుని తనకు తండ్రి యనియు తల్లియనియు ప్రేమించును. శ్రీ రామకృష్ణపరమహంస భగవంతుని తల్లియని యుపాసించి యున్నాడు. ఏసుక్రీస్తు ప్రభువు భగవంతుని తండ్రిగ నుపాసించినాడు. భగవంతుని ప్రేమించుటయనగా ఆయనను శుష్కస్తోత్రము చేయుటగాదు. ప్రతిదినము భగవంతుని ధ్యానించుట వలనను ఆయనయొక్క కళ్యాణగుణములను వర్ణించి మననము చేయుటవలనను ఆ కళ్యాణగుణములతో కొన్నియైనను మానవులలో నలవడుట కును మానవులలో హృదయపారిశుద్ధ్యము వృద్ధిచెందుటకును మనశ్శాంతి, మనోధైర్యము ఆనందము కలుగుటకును తోడ్పడ గలదు. కాని చేయవలసినపని యేమనగా ఆయనకు ప్రియ మైన మానవకోటిని మాతృదేశములోని ప్రజలను ప్రేమించి వారి కష్టములనే తమవిగా నెంచి తన్నివారణకై వారికి సేవ చేయవలయును. ద్వేషమునకు హృదయమున నెచ్చటను తా వుండగూడదు. ధర్మసంస్థాపన కార్యమును చేయుటలో ధర్మ మునకు వ్యతిరేకపక్షమున నున్నవారితో పోట్లాడవలసివచ్చి నను వారిని ద్వేషించకుండగనే పోరాడవలెను. వారు అధర్మ మును విడిచి మంచి మార్గమునకు రావలెననియే అనుక్ష ణము కోరికయై యుండవలెను. వ్యతిరేకించునది ప్రతిఘటిం

చునది అధర్మము మాత్రమే. మానవులమీద ద్వేషముండ కూడదు. నీకు అపకారము చేసినవారిని నయితము ప్రేమిం చుము అని ఉపనిషన్మతము.]

16. తదమృత మభయం.

ఛాందోగ్య - అష్ట-తృతీయ. 4

ఏష ఉ ఏవవామనీ రేష హి సర్వాణి వామాని
నయతి సర్వాణి వామాని నయతి య ఏవం వేద.

ఛాందోగ్య - చతుర్థ, పంచదశ. 3.

ఏత ద్విదు రమృతా స్తే భవన్తి. అథేతరే దుఃఖమే వాపి యన్తి.

బృహదారణ్యక. 4-4-14.

ఈ పరమాత్మయే అమృతము. సమస్త భయములను పోగొట్టునది. (ఈ పరమాత్మ నుపాసించువారికి దుఃఖ ముం డదు. ఆనందమే కలుగును. దేనిని గూర్చి గాని భయముం డదు. మంచిధైర్యము కలుగును. ధైర్యముతో ధర్మపక్షమున పోరాడగలరు.)

ఈ పరమపురుషుడు (ఆశ్రితులకు) భక్తులకు శ్రేయస్సు కలుగచేయువాడు. వీడేకదా సమస్త కళ్యాణములను పొందిం చువాడు. దీని నిట్లు తెలిసికొనువాడు సమస్త శోభనములను పొందును. (పరమేశ్వరుడు తనతో కూడ నున్నాడు. తనకు సర్వవిధములను సహాయము చేయును. తన జీవితావసరము లను సమకూర్చును. తనను మంచిమార్గమున నడపును. కష్ట ములు లేకుండ చేయును. కష్టము లొకవేళ వచ్చినను అవి అన్నియు తనమేలుకొరకేఅను విశ్వాసముతోను ధైర్యముతోను

భక్తుడు తన విధ్యుక్తధర్మములను నెరవేర్చ గలడు.) పరమేశ్వరుని తెలిసికొన్నవారు అమృతత్వమును పొందుదురు. ఇతరులకు (పరమాత్మను తెలిసికొననివారికి) దుఃఖమే కలుగును.

Paramaatma is Bliss and gives protection from fear. (There will be no grief to the devotee. He will only have joy. He will have no fear about anything. He will be very courageous. He can fight with great courage for the right cause).

It is this great God that causes good to the devotees. It is He that showers all blessings on them. He who realises this will get all blessings. (The devotee can discharge his duties with courage under the faith that God is with him and helps him in all ways, that he will supply him with all the necessities of life and guide him in a proper path, that by the grace of God he will be free from all difficulties, and that even if difficulties come they will be only for his good).

Those who realise Parabrahma attain eternal Bliss. Those who don't realise Him get only misery.

17. జ్ఞానప్రసాదేన విశుద్ధసత్వ, స్తతస్తుతం పశ్యతే నిష్కలం ధ్యాయమానః.

ముణ్డక. తృ. ప్ర. 8.

నిరవయవమైన సర్వేశ్వరుని ధ్యానించువాడు, పరమాత్మ యొక్క అనుగ్రహముచేత పరిశుద్ధమైన అంతఃకరణము కలవాడై పిమ్మట ఆ పరమాత్మను చూచుచున్నాడు.

He who meditates upon God will become purified and attains mental purity by His grace. Then he will realise God fully.

[వరా:—ఇది పాపాత్ములకు మంచిమార్గమునకు రావలసిన దని పిలుపు. పాపముల కలవాటుపడినవారు నిరాశ చెందనక్కరలేదు. వారు పశ్చాత్తప్తులై ఈశ్వరధ్యానమును

అభ్యసించినచో ఈశ్వరుని అనుగ్రహమువలన క్రమముగా పరిశుద్ధులై పాపచింత లన్నియు నశించి మనఃపారిశుద్ధ్యము నొందుదురు. పిమ్మట మంచి భక్తులై, జ్ఞానులై, కర్మయోగులై ఈశ్వరుని పొందుదురు. దుర్గుణముల కలవడినవారు బాగుపడి ఉత్తమమార్గమునకు వచ్చి పరిశుద్ధులై బ్రహ్మజ్ఞానమును పొందవలయు ననియే ఈశ్వరోద్దేశ్యము. బాగుపడవలయునని ప్రయత్నించువారికి ఈశ్వరసహాయము కలుగును.)

18. మహాన్తం విభు మాత్మానం
మత్వా ధీరో న శోచతి.

కఠ. ద్వి. ప్ర. 4.

ఉత్కృష్టుడును సర్వవ్యాపియును అగు పరమేశ్వరుని ధ్యానించి జ్ఞానియైనవాడు దుఃఖరహితు డగుచున్నాడు.

The wise man becomes free from all grief by meditating upon the great all-pervading God.

19. యుఞ్జతే మన ఉత యుఞ్జతే ధియో
విప్రావిప్రస్య మహతో విపశ్చితః
విహోత్రాదధే వయునా విదేక
ఇన్మహీ దేవస్య సవితుః పరిష్టుతిః

శ్వేతాశ్వతర 2-4.

జ్ఞానులగువారు తమ ఇంద్రియములను బిగబట్టి మనస్సును బుద్ధిని లోబరచుకొని ధ్యానమును సమాధిని అభ్యాసము చేతురు. సర్వవ్యాపియై అనంతుడై సర్వజ్ఞుడై స్వయంప్రకాశుడై తమ హృదయములలోనున్న పరమాత్మయొక్క మహిమ ఉత్కృష్టమైనది. (ఆ మహిమ వారు చూతురు.)

The wise restrain their senses and control their minds and intellect and practise meditation and concentration. Great is the glory of the all- pervading, Infinite, all-knowing self - illuminous Paramaatma who resides in their hearts. (They realise that glory).

20. తాం యోగమితి మన్యన్తే స్థిరా మిన్ద్రియధారణామ్
అప్రమత్తస్తదా భవతి యోగోహి ప్రభవాప్యయౌ.

కఠ. ద్వి. తృ 11

నిశ్చలమైన ఇంద్రియధారణమును యోగమని తలంతురు. అది కలిగినపుడు మనుజుడు ప్రమాదములేనివాఁ డగుచున్నాఁడు. యోగము మనసు నిలకడలేనపుడు పోవును.

Firm control of the senses and fixing the mind on Paramaatma is known as Yoga. Then the Yogi becomes free from all vagaries of mind Yoga will be lost by want of steadiness of the mind or inefficient control of the mind.

21. సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ
యో వేద నిహితం గుహాయాం
పరమే వ్యోమన్ సోఽశ్నుతే సర్వాన్కామా
న్సహ బ్రహ్మణా విపశ్చితేతి.

తైత్తిరీయ. బ్రహ్మవల్లి. ప్రథమ. 1

ఆ పరమాత్మ ఎట్టి మార్పును చెందని శాశ్వతసత్యము, జ్ఞానమయము, అనన్తమునై యున్నది. ఏయుపాసకుడు ఆ పరమపురుషుని తన హృదయగుహయందుకూడ నున్నటుల చూచుచున్నాడో ఆ యుపాసకుడు సర్వజ్ఞుడైన పరమేశ్వరుని సహాయమునవలన సమస్తమైన ఉత్తమ కోరికలను అనుభవించుచున్నాడు. మరియు పరమేశ్వరుని చేరుచున్నాడు.

Paramaatma is Truth, Intelligence and Infinitude. That devotee who sees Him also in the cavity of his own heart

realises all his noble desires by the help of the Omniscient Lord and also attains Him;

22. సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి
శాన్త ఉపాసీత.

ఛాందోగ్య. తృతీయ. చతుర్దశ 1.

ఈ విశ్వమంతయు పరమాత్మలోనుండి వచ్చినది, పరమాత్మవలన పోషింపబడుచున్నది, తిరిగి లయమై పరమాత్మ లోకచేరును, పరమాత్మ దీని యంతటిలో వ్యాపించియున్నాడు, ఇది యావత్తు బ్రహ్మాత్మకమే, అని శాంతమనస్కుడై ఇంద్రియనిగ్రహము కలిగి భక్తుడుపాసింపవలెను.

The devotee with control of passion and in a perfectly calm mind should practice meditation that this whole universe has come out of God, is maintained by Him and will finally be dissolved again into Him and that God is pervading the whole universe and that everything has God as its soul.

23. యస్మిన్ సర్వాణి భూతాని
ఆత్మైవాభూ ద్విజానతః
తత్ర కో మోహః కశ్శోక
ఏకత్వ మనుపశ్యతః. ఈశావాస్య. 7.

విశ్వముయొక్క ఏకత్వమును గ్రహించి సర్వభూతములను తన ఆత్మవలెనే చూచుకొనువారికి భ్రమ యెక్కడిది? దుఃఖ మెక్కడిది?

What delusion, what sorrow is there for the wise man, who sees the unity in existence and perceives all beings as his own self.

24. యస్తు సర్వాణి భూతాని
ఆత్మన్యేవానుపశ్యతి

సర్వభూతేషు చాత్మానం
తతో నవిజుగుప్సతే. ఈశావాస్య. 6.

ఎవరైతే పరమాత్మయందే సమస్తభూతములను జూచుచున్నాడో, సమస్తభూతములయందును పరమాత్మను జూచుచున్నాడో అట్టివాడు ఏ భూతమును తనకన్న తక్కువగా చూడడు.

He, who sees all beings in Paramaatma and Paramaatma in all beings will not look down upon anything with contempt or as inferior to himself.

[వరా:—జీవన్ముక్తుడైన పురుషుడు తనను యావత్తు విశ్వముతో ఐక్యపరచుకొనును అను ఆదర్శమును బోధించుటకు శ్రీమద్భాగవతములో నొక చక్కని కథ యివ్వబడినది. శ్రీ వేదవ్యాసులవారి కుమారుడగు శుకమహర్షి చిన్నతనమునుంచియు బ్రహ్మజ్ఞానియై జితేంద్రియుడై కామేచ్ఛ బొత్తిగాలేక యావజ్జీవము బ్రహ్మచారిగనే యుండెను. ఆయన విశ్వము నంతటితోను తనను ఐక్యత చేసికొనిన జీవన్ముక్తుడు. ఒకదినము ఆయనను వెదకుటకై వేదవ్యాసులవారు బయలుదేరి 'ఓహో కుమార' యని పిలువగానే చుట్టునున్న వృక్షములన్నియు శుకమహర్షితో తన్మయత్వమును చెందినవియై 'ఓ' యని బదులుచెప్పినవి. శ్రీమద్భాగవతము ప్రథమస్కంధములో బమ్మెర పోతన్నగారు యిటుల వ్రాసిరి:—

"సముడై యెవ్వడు ముక్తకర్మచయుడై సన్న్యాసియై యొంటిబో
వ మహాభీతి నోహోకుమార! యనుచున్ వ్యాసుండుచీరంగ వృ
క్షములున్ దన్మయతన్ ప్రతిధ్వనులుచక్కంజేసె మున్నట్టిభూ
తమయున్ మ్రొక్కెద బాదరాయణితపోధన్యాగ్రణిన్ ధీమణిన్"

ఈ శుకమహర్షియే శ్రీమద్భాగవతమునంతను పరీక్షిన్మహారాజునకు బోధించిన మహాజ్ఞాని. ఇట్టి ఆదర్శములను ఉపనిషత్తులు బోధించుచుండ మానవులలో ఎక్కువ తక్కువ భేదము లెటుల నుండగలవు? అట్టి భేదభావమును, అందువలన కలిగెడి అహంకారభావమును రూపుమాపి సర్వమానవ సమానత్వమును స్థాపించవలసియున్నది.]

25. విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా తదేవ
వీర్యవత్తరం భవతీతి ఖలు.

ఛాందోగ్య. ప్ర. ప్ర. 10.

తెలివితోడను శ్రద్ధతోడను బ్రహ్మజ్ఞానముతోడను చేయబడు ఏ మంచికార్యమైనను లేక సేవయైనను వీర్యవత్తరమగును.

Any good deed or service performed with intelligence, devotion and true knowledge of God will be productive of great results.

26. కుర్వన్నేవేహ కర్మాణి
జిజీవిషే చ్ఛతగ్ం సమాః
ఏవం త్వయి నాన్యథేతోఽస్తి
నకర్మ లిప్యతే నరే.

ఈశావాస్య. 2.

ఈజగత్తునందు మంచికర్మలను చేయుటకొరకే, అనగా సంఘమునకును, దేశమునకును, మానవజాతికిని, సర్వభూతములకును సేవాధర్మమును నిర్వర్తించుటకొరకే, మానవుని ఆయుః పరిమాణమగు నూరు సంవత్సరములు పూర్తిగ జీవించియుండవలెనని నీవు కోరదగియున్నది. అటుల గానిచో నది

వ్యర్థపుజన్మ. ఈ సేవాధర్మము నీయందుంచబడినది. ఇంతకన్న మార్గాంతరము నీకు లేదు. నీవు ఫలాపేక్ష రహితముగా భగవదర్పణముగా నీ విధియని తలచి సేవాధర్మమును నిర్వహించిన యెడల నీవుచేసిన కర్మలన్నియును నిన్ను పునర్జన్మమునకై బంధించునవిగాక నీకు జనన మరణ చక్రమునుండి విముక్తి శాశ్వతానందము కలుగును.

It will be proper on your part to desire to live for the full one hundred years which is the span of human life only for the purpose of performing good deeds, that is for the purpose of doing service to society, country, humanity and all living beings. Otherwise, the life you lead will be a useless one. This duty of service is placed on you. There is no other Path for you. Then the works you do as offerings to God, without attachement to the fruits thereof in a selfless manne,rand as a matter of duty, will not bind you down to the next birth but will free you from the cycle of births and deaths and make you attain eternal bliss.

[వ్యా:—ఈ మహామంత్రము మానవుని జీవిత పరమావధిని శాసించుచున్నది. ఇది సర్వమానవుల ధర్మము. ఇదియే భగవద్గీతలో విస్తరించి చెప్పబడిన నిష్కామకర్మ. త్యాగము (Renunciation) సేవ(Service) భారతజాతికి ఆదర్శము లని శ్రీ వివేకానందస్వాములవారు చెప్పియున్నారు. ఈశ్వరసేవ అనగ మాతృదేశమునకును సర్వమానవకోటికిని సర్వభూతములకును సేవ చేయుటయే అయియున్నది.]

27. వేదాహమేతం పురుషం మహాంతం
ఆదిత్యవర్ణం తమసఃపరస్తాత్
తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి
నాన్యఃపన్థా విద్యతేఽయనాయ. శ్వేతాశ్వతర 3-8.

శ్వేతాశ్వతరమహాఋషి ఇటుల ప్రకటించినాడు. అంధకారమును దాటి తేజస్సునకు స్థానమై స్వయంప్రకాశమానుడుగ నున్న పరమపురుషుని నేను పొందినాను. ఆయనను పొందుటవలననే ఏ పురుషుడైనను మృత్యువును దాటగలడు. ఈ దుఃఖభూయిష్ఠమైన జననమరణ చక్రమునుండి తరించుటకు ఆయనను పొందుటతప్ప వేరు మార్గములేదు.

The Maharshi Swetaaswatara has declared thus :—

I have realised the Paramapurusha, the self illuminous and omniscient who is beyond all darkness and ignorance. Any person who wants to conquer death can only do so by attaining Him. In order to become free from the cycle of births and deaths which are full of sorrow there is no other way except attaining Him.

[వ్యా:—మోక్షమనగా పరమాత్మను పొంది శాశ్వతానందమును అనుభవించుట యని మనము తెలిసికొనియున్నాము. మోక్షమును పొందిన జీవాత్మ పరమాత్మ యనెడి వీణయొక్క వివిధ శ్రుతులలో నొక శ్రుతియై పరమాత్మతో కలసియే తన మధురగానమును వినిపించుననని బృహదారణ్యకోపనిషత్తు 4-5-10 లో యాజ్ఞవల్క్యుడు తన భార్య యగు మైత్రేయితో చెప్పెను. అపుడు పరమేశ్వరుడు గావించుచున్న కార్యములో భాగస్వామి యగును. కాని పరమాత్మ యొక్క ఇచ్ఛాప్రకారము ముక్తులైన జీవాత్మలు అనేకలోకములలో సంచరించుచు ధర్మసంస్థాపనవిధిని నిర్వర్తించుచు తమ వ్యక్తిత్వమును కలిగియే యుందురు. (తైత్తిరీయ; ఛాందోగ్య) ఇట్టివారిని అవతారపురుషు లని పిలచెదరు. ఈశ్వరారాధనయొక్క యుద్దేశ్యము మోక్షమునొందుటకే. ఈశ్వ

రునివలె అయినగాని ఈశ్వరునిలో చేరుటకు జీవాత్మకు అర్హత కలుగనేరదు, మోక్షము కలుగదు, అవీణయొక్క మధుర శ్రుతులలో నొకశ్రుతిగాకపోయినచో మధురగానమునివ్వక అపశబ్దము పలుకును మధురశ్రుతియైనవుడే దానిని వీణెలో భాగముగా తీసికొనెదరు. గావున ఈశ్వరారాధనమువలన జీవాత్మ పరమాత్మవలె కావలెను. అపరిపూర్ణుడైన మానవుడు పరిపూర్ణుడైన ఈశ్వరునివలె నగుటకే ఈశ్వరారాధనము సాధనమైయున్నది. మితమైన స్థితిలోనుండి అనంతమైన స్థితిని పొందుట(from finite to infinitude)లోపభూయిష్ఠమైన అపరిపూర్ణత్వమునుండి పరిపూర్ణత్వమును పొందుట-(from imperfect to perfect) మానవత్వమునుండి ఈశ్వరత్వమును పొందుట (from human to divine) ఇదియే మానవజీవితము యొక్క పరమావధి."Be ye perfect as your Father in Heaven is" 'నాతండ్రియగు భగవంతునివలె మీరుకూడ పరిపూర్ణత్వమును పొందుడు' అని ఏసుక్రీస్తు ప్రభువు కూడ చెప్పియున్నాడు. ఈశ్వరారాధనమునందు (1) పై. నె. 23,24 ర్ల మంత్రము లలో చెప్పబడినటుల యావత్తు విశ్వము పరమేశ్వరునిలో నున్నది, యావత్తు విశ్వములో పరమేశ్వరు డున్నాడు అను జ్ఞానము. అందువలన సర్వమానవులను నమస్త భూతములను తనవలెనే చూచుకొనుట, వారి కష్టములనుతన విగనే భావించి తన్నివారణకై కృషిసలుపుట. (2) పై. నె. 13, 14, 15 ర్ల మంత్రములలో చెప్పబడినటుల పరమేశ్వరుడు ప్రేమస్వరూపు డని యుపాసించి మాతృదేశమును సర్వమానవులను సర్వ భూతములను ప్రేమించి వారి కష్టముల నివారణకై పాటు

పడుట. (3) పై నె 19, 20 ర్ల మంత్రములలో చెప్ప బడినటుల యోగసమాధిలో పరమాత్మ మీద యావత్తు మనస్సును ధారణముచేసి ఆయనను తన హృదయములో దర్శించుచుండుట. యోగసమాధి చాలించగనే అత్యంత మైన తేజస్సుతో ఆత్మశక్తితో దేశోద్ధరణమునకు ప్రపం చోద్ధరణమునకు పూనుకొనుట. (4) పై 25, 26 ర్ల మంత్ర ములలో చెప్పబడినటుల సేవాతత్పరతను పొంది సంఘో ద్ధరణ దేశోద్ధరణ లోకోద్ధరణ కార్యములలో నిమగ్ను డగుట. (5) పై నె 7 రు మంత్రములో చెప్పబడినటుల పర మాత్తయొక్క ధర్మసంస్థాపనయజ్ఞము నందు సమిధనై ఆత్మా ర్పణము గావించుట. అందుకు కావలసిన వైరాగ్యము త్యాగము - ఇవన్నియు ఈశ్వరారాధనముయొక్క భాగములై యున్నవి. శ్రీ వివేకానంద స్వాములవారు చెప్పినటుల జ్ఞాన యోగము, భక్తియోగము, రాజయోగము, కర్మయోగ ములు, మరికొందరు చెప్పినటుల భక్తి జ్ఞాన వైరాగ్యములు ఈశ్వరారాధనముయొక్క వివిధభాగములై యున్నవి. పర మేశ్వరునివలె నగుట యనగానే మూడవపాఠములో చెప్పబడిన పరమేశ్వరుని గుణములగు ఆత్మశక్తి, పరిశుద్ధత, సత్యము, ధర్మము, విజ్ఞానము, ఆనందములను పరిపూర్ణముగా పొందుట. ఇందుకు బ్రహ్మచర్యము గొప్ప సాధనము. పైవిధముగా శ్రద్ధ తోను విశ్వాసములోను ఈశ్వరారాధనము చేయ యత్నిం చినకొలదియు మానవుడు పైమెట్లకెక్కి ఈశ్వర సహాయ ముచే పరిపూర్ణత్వమును పొందును. శ్రీమధుసూదన సరస్వ తులవారు చెప్పినటుల భ్రమరము ఒక కీటకమును తెచ్చి తన

వలెనే చేసినటుల శ్రీమన్నారాయణుడైన పరమాత్మ నిజమైన భక్తునికి చేయూతనిచ్చి పైకెత్తి తన వలెనే అగునట్లు చేయును.]

28-(1) పరమం సామ్యముపైతి. ము. తృ. ప్రథమ 3.

సముక్తజీవుఁడు పరమేశ్వరునితో సమానుడగును.

The liberated soul attains equality with God.

(2) స యథా వీణాయై వాద్యమానాయై
న బాహ్యా శ్ఛబ్దా శ్ఛక్నుయాద్
గ్రహణాయ వీణాయైనుగ్రహ
ణేన-వీణావాదస్యవా-శబ్దో గృహీతః

బృహదారణ్యక 4-5-10

వీణాగానము చేయునపుడు దాని వివిధప్రత్యేకశ్రుతులను వేరువేరుగ తెలిసికొనజాలము. అవన్నియు ఆ వీణాగానములో కలసిపోవును. వీణయొక్క వివిధ వాయిద్యములు మొత్తపుగానములో చేరిపోవును. (ఇటులనే ముక్తుడైన జీవాత్మ ఈశ్వరు డనెడి వీణాగానములో నొక శ్రుతి యగుచున్నాడు.)

As when a Veena is played on, one cannot distinguish its various particular notes, but they are included in the general note of the Veena or in the general sound produced by different kinds of playing (so the liberated soul becomes a note in the harmonious music of the Veena, namely God.)

(3) సః స్వరా డ్భవతి
తస్య సర్వేషు లోకేషు కామచారో భవతి.

ఛాందోగ్య. సప్తమ. పంచవింశ. 2.

ముక్తజీవుడు ఈశ్వరత్వమును పొందుచున్నాడు. సర్వస్వతంత్రుడై పరమాత్మయొక్క యుద్దేశ్యమైన ధర్మసంస్థాపన

కొరకు ముక్తజీవుడు సమస్త లోకములలోను సంచరించు చున్నాడు.

The liberated soul attains the perfection of Godhood. He moves about, with absolute freedom, in all the worlds for the purpose of establishing Dharma (righteousness.)

అద్వైతానుసంధానము

[వరా:—జీవుడు పరమాత్మయను మండుచున్న అగ్ని నుండి వచ్చిన నిప్పురవ్వయనియు మరల నా యగ్ని లోనే చేరుననియు వెనుకటి 2వ పాఠము నె 6 రు మంత్రములో చెప్పబడినది. ఈమంత్రములో ఈశ్వరునివలె అయిన జీవాత్మ మరల ఈశ్వరుని పొందుచున్నదనియు, ఈశ్వరత్వమును పొందుచున్నదనియు చెప్పబడినది. ప్రత్యేకముగ వచ్చిన నిప్పురవ్వ మరల మండుచున్న అగ్నిలో భాగమైనది. ఇట్టి స్థితిలోనికి (జీవుడు) మానవుడు వచ్చుటకు ఈపాఠములో చెప్పబడిన విధముగా ఈశ్వరారాధనను చేయవలెను. అనగా మానవుడు ఈపాఠములో చెప్పబడిన విధముగా జితేంద్రియుడై హృదయపారిశుద్ధ్యమునుపొంది పాపరహితుడై ఇందులో చెప్ప బడిన శిక్షణములను పొంది ఉపాసనలను గావించి అత్యంతమైన దేశసేవను మానవసేవను చేసి ధర్మసంస్థాపనకొరకు కఖండమైన త్యాగమునుచేసి ఈశ్వరునియొక్క సమస్తసద్గుణములలో పరి పూర్ణత్వమును పొంది జ్ఞానానందస్వరూపుడుగ కావలెను. ఇట్టి స్థితిలోనికి వచ్చినవాడే 'అహం బ్రహ్మాస్మి' 'శివోహం' 'నేనే పరబ్రహ్మము' అని తలచుటకు, చెప్పుటకు అర్హతకల వాడగుచున్నాడు. ఇట్టి స్థితిని పొందినవాడు జీవన్ముక్తుడు. ఇందుకొరకు మానవుడు సర్వదా కృషిసలుపవలెను. "బ్రహ్మ

చారి, యతి, గృహస్థుం డెవ్వడేనియు, చిత్తంబు పరిపక్వంబు గాక అద్వైతానుసంధానంబు చేసినయెడల మూఢుండగును'' అని శ్రీమద్భాగవతము సప్తమస్కంధములో నారదుడు ధర్మరాజునకు చెప్పినదానిలో కలదు. ప్రపంచములో పుట్టిన అత్యుత్తమ ఆధ్యాత్మిక, నైతిక మేధావి (Great spiritual and moral genius) యగు శ్రీ శంకరాచార్యులవారి అద్వైత తత్త్వమును, 'మాయ' (భ్రాంతి) సిద్ధాంతమును, కర్మసిద్ధాంతమును, తెలియని అపార్థములచే అనేకమందిమూఢులు పాడుచేసి "సర్వము మాయ, పాపపుణ్యములు భ్రాంతి, అది ఇది ఒకటే మంచిచెడ్డ అంతా బ్రహ్మమే, అంతా ప్రారబ్ధకర్మమే, మనము చేయగలది ఏమియు లేదు" అనుమాటలను ప్రయోగించుచు, ప్రజలను నిస్సహాయులుగను అనీతిపరులుగను గావించి ఉత్కృష్టమైన వేదాంతముయొక్క గౌరవమును చెడగొట్టుచున్నారు. అట్టి వారిని మూఢులని స్వార్థపరులని మోసగాండ్రని ప్రజలు గ్రహించవలెను.]

---

## ఆ ఱ వ పా ఠ ము

### మానవధర్మములు (Duties of Man)

1. యః ఛందసా మృషభో విశ్వరూపః
   సమేంద్రో మేధయా స్పృణోతు
   శరీరం మే విచర్షణమ్
   జిహ్వామే మధుమత్తమా, కర్ణాభ్యాం భూరి విశ్రువమ్.

తైత్తిరీయ. శిక్ష. చతుర్థ. 1, 2.

వేదమంత్రము లెవనిని పరమపురుషుడని తెలుపుచున్నవో, ఎవరు భక్తుల న్యాయమైన కోరికలను దీర్చునో, అట్టి పరమాత్మ నాకు బుద్ధిబలమును ప్రసాదించునుగాక.

నా శరీరము బలారోగ్యములు గలదియై ప్రకాశించునుగాక; నా నాలుక మధురవాక్కుగా నుండునుగాక; నా చెవు లెల్లప్పుడును యోగ్యమైన వాటినే వినుచుండునుగాక.

May He who is the most excellent in the sacred hymns and He who is the Supreme Lord that fulfils all the proper desires of the devotees grant me intellectual vigour.

May my body shine in health and strength, may my speech be sweet and gentle, may my ears always listen to good things.

[వరా:—శరీరమును దృఢముగాను ఆరోగ్యముగను ఉంచుకోవలసినదని, బుద్ధిబలమును బాగుగా వృద్ధిచేసికొని జ్ఞానమును సంపాదించవలెనని, ఇంద్రియనిగ్రహము కలిగి యోగ్యమైన ప్రవర్తన కలిగియుండవలెనని, చెడుసంగతులు వినకుండ ఎల్లప్పుడును యోగ్యమైన వాటిని, ఉపయోగమైన వాటినే వినుచుండవలెనని, ఇతరులతో చేయు సంభాషణ పరుషముగా నుండక బహుమర్యాదకరమైనదిగ నుండవలెనని ఉపనిషత్తులు పదేపదే చెప్పుచున్నవి. శరీరమునకు ఆరోగ్యమును బలమును ఆయుర్వృద్ధిని కలుగచేయుటకు మిగుల ముఖ్యమైనవి (ఉపస్తంభములు) మంచి ఆహారము, సరియైన నిద్ర, బ్రహ్మచర్యములని చరకసంహిత సూత్రస్థానము ఏకాదశాధ్యాయమునందు చెప్పబడినది. (త్రయ ఉపస్తంభా ఇతి ఆహారః స్వప్నో బ్రహ్మచర్యమితి.)]

2. మాతృదేవో భవ; పితృదేవో భవ;
ఆచార్యదేవో భవ; అతిథిదేవో భవ;

తైత్తిరీయ, శిక్ష. ఏకాదశ. 3

తల్లిని, తండ్రిని, గురువును, అతిథిని దైవమువలె గౌరవించవలెను.

Treat your mother, father, preceptor, and guest (like God) with the utmost respect.

3. యా న్యనవద్యాని కర్మాణి; తాని సేవితవ్యాని; నో ఇతరాణి;

తైత్తిరీయశిక్ష, ఏకాదశ 4

ఏపనులు నింద్యములుకావో ఆ పనులు చేయదగినవి. ఇతరములు ఆచరింపదగినవి కావు.

Those acts which are irreproachable alone are to be performed and not others.

4. అన్నం నపరిచక్షీత; తద్వ్రతమ్;

తైత్తిరీయ భృగు. అష్ట.

అన్నం బహుకుర్వీత; తద్వ్రతమ్;

తైత్తిరీయ భృగు. నవమ.

అన్నమును పారవేయకూడదు. అది వ్రతముగా భావించవలెను.

అన్నమును వృద్ధిచేసి బహుజనోపయుక్తముగా చేయుము, ఇది వ్రతముగా భావించవలెను.

You should not throw away food. This should be observed as a pious rule.

You should increase the production of food and make it available to many. That should be observed as a pious rule.

5. న కంచన వసతౌ ప్రత్యాచక్షీత; తద్వ్రతమ్;
తస్మాద్యయా కయాచ విధయా బహ్వన్నం ప్రాప్నుయాత్
తైత్తిరీయ. భృగు. దశమ.

గృహమునకు వచ్చిన ఏ అతిథినిగాని నిరాకరించకూడదు. అది వ్రతముగా భావించవలెను. అందువలన బహుజనోపయుక్తముగ చేయుటకై ఏదో ఒక (న్యాయమైన) పద్ధతి మీద సమృద్ధముగ అన్నమును సంపాదించ వలెను.

You should not reject any person who seeks hospitality at your house. That should be observed as a pious rule. Therefore you should acquire food plentifully by all (proper) means to be used for the benefit of many.

[షరా:—పై నాలుగైదు మంత్రముల యుద్దేశము మన చుట్టునున్న సంఘములో ఎవరుగాని తిండిలేక మలమల మాడకూడదు. భోజనములేక పస్తు పరుండకూడదు. అన్నము లేక చావకూడదు. ఇది మన భారతీయ నాగరికత యొక్క పునాదులలో నొకటి.]

6 ఈశావాస్య మిదగ్ం సర్వం
యత్కించ జగత్యాం జగత్
తేన త్యక్తేన భుఞ్జీథా
మా గృధః కస్యస్విద్ధనమ్. ఈశావాస్య 1.

ఈ మారిపోవుచుండెడి సర్వజగత్తు దానికి నియామకుడును ప్రభువును అయిన ఈశ్వరునిచేత వ్యాపించబడి యున్నది. జగత్తుయొక్క ప్రతి చిన్నభాగము కూడ ఆయనచేత వ్యాపించబడి యున్నది. (కావున జగత్తులోని ప్రతి వస్తువు ఆయనదే. నీ స్వాధీనములోని ఆస్తికూడ ఆయనదే.) కావున నీకు లభిం

చిన ఆస్తిని త్యాగబుద్ధితో మాత్రము అనుభవించవలెను. (దానిలో నీ కెంతవరకు అవసరమో అంత మాత్ర మనుభవించి మిగిలిన దానిని పరోపకారమునకై వినియోగించుము.) ఇతరులకు చెందిన దానికొరకై ఎన్నడును ఆశించకుము.

The whole changing universe is pervaded by Iswara who is its Lord and Controller and every small part of it is pervaded by Him. (Therefore everything in the universe belongs to Him. The property that is in your possession also belongs to Him.) Therefore you should only enjoy in a spirit of self-sacrifice. (Enjoy only to the extent that is absolutely necessary for you. Use the rest for the good of others.) Never covet that which belongs to another.

[వ్యా:—ఈ మంత్రముయొక్క యుద్దేశ్యము 'సర్వే జనా స్సుఖినోభవన్తు' అయియున్నది. మానవులు తోడిమానవులను, మానవసంఘములు తోడి మానవసంఘములను, మానవజాతులు తోడిమానవజాతులను, అణగద్రొక్కి వారి స్వత్వములను, ఆస్తిని, సంపదను అపహరించుటకు యత్నించకూడదని ఈ మహామంత్రము శాసించుచున్నది. అట్లు అపహరించవలెనను దురాశను విడిచి పెట్టినయెడల సర్వమానవులును, మానవసంఘములును, మానవజాతులును సుఖవంతు లగుదురు. లోకములో శాంతి, ప్రేమ, సోదరత్వము వర్ధిల్లును. ఇంతేగాక మానవులు తమకు లభించిన ఆస్తికి తాము (ట్రస్టీలమని) ధర్మకర్తలమని మాత్రమే యని తలచి తమ అవసరములకు కావలసినది పోగా మిగిలిన దానిని దేశమునకు మానవజాతికి ఉపకారము చేయుట కుపయోగించవలెనని కూడ యీ మంత్రము చెప్పుచున్నది.]

7 స్తేనో హిరణ్యస్య సురాం పిబగ్ శ్చ గురోస్తల్ప
మావసన్ బ్రహ్మహాచ ఏతే పతన్తి
చత్వారః పంచమ శ్చాచరగ్ స్తైరితి.

ఛాందోగ్యపంచమ. దశమ. 9.

బంగారము దొంగిలించినవాడు, సురాపానము చేయువాడు, గురుభార్యతో వ్యభిచారము చేయువాడు, బ్రహ్మజ్ఞానియైన వానిని హత్యచేయువాడు, ఈ నలుగురును మహాపాతకులు. వారితో సహవాసము చేయువాడు కూడ అయిదవ పాతకుడు. ఈ అయిదుగురికి పంచమహాపాతకు లని పేరు.

He who steels gold, he who drinks toddy and liquor, he who commits adultery with his preceptor's wife and he who kills a good and holy person—these four are the greatest sinners. He who associates with any of these four is the fifth sinner. These are called the "Five great sinners."

[వరా:—ఇందులో నాలుగు చెడు పనులు బహు గొప్ప పాప కృత్యములని చెప్పబడినవి. సురాపానమును జేయువాడు వివేకము సొంతము నశించి ఎట్టి యితర పాపకృత్యములను చేయుటకు వెనుతీయడు. గనుక ఇది మహాపాతకము. తనకు విద్యనిచ్చిన గురువుయొక్క భార్య తనకు తల్లివంటిది. అటువంటి గురుపత్నితోనే సంగమము చేసినవాని ఇంద్రియలోలత్వమునకు మేరయుండదు. కామమునకు అతడు పూర్తిగ దాసుడై పోయినాడు- గనుక ఇది మరియొక మహాపాతకము. బ్రహ్మజ్ఞానియై యెవరికిని అపకారము చేయక ఇతరుల కుపకారము చేయుటయందే కాలము గడుపు పుణ్యాత్ముని చంపినవాడు ఎవరిని హింసించుటకును హత్యచేయుటకును సందేహింపడు. అతని క్రోధమునకు మేరలేదు. గనుక ఇదికూడ మహాపాత

కము. మొదటి మహాపాతకమైన దొంగతనములో బంగార
మును మాత్రము చేర్చుటలో చాల అర్థము కలదు. ఒకమాన
వుడు తిండిలేక మలమలమాడుచు దగ్గరగా కనుపడిన అన్నమును
గాని ఇతర భోజ్యములనుగాని దొంగిలించి తిన్నచో బియ్యమును
దొంగిలించి పస్తుపడుకొనియున్న తన దారాపుత్రులకు పెట్టి
నచో దానిని నేరముగ నెంచక శిక్షించక విడిచిపెట్టవలెనని
"గృహక్షేత్రంబులఁజొచ్చి ఉదరపూరణ మాత్రంబు దొంగిలిం
చినవాని దండింపక విడిచిపెట్టవలె"నని నారదుడు ధర్మరాజున
కుపదేశించినట్లు శ్రీ మహాభాగవతము సప్తమస్కంధములో
నున్నది. అటులగాక బంగారమును దొంగిలించుచున్నవాడు
దానిని దాచుకొని కొంత ఆస్తిగ మార్చుకోవలెనని యుద్దే
శించినాడు. బంగారముయొక్క దొంగతనమనగా ఇతరుల
ఆస్తిని అపహరించుటయై యున్నది. ఇదికూడదని పైన చెప్ప
బడిన నెం రు (ఈశావాస్య మిదగ్ం సర్వం) అను మంత్ర
ములో శాసించబడి యున్నది].

8\. తదేత దేవైషా దైవో వాగనువదతి స్తన
యిత్నుర్ "ద" "ద" "ద" ఇతి
దామ్యత దత్త దయధ్వమితి తదేతత్రయం శిక్షేత్
—దమం దానం దయామితి.

బృహదారణ్యక 5-2-3

"ద" "ద" "ద" అని మూడు మార్లు ఈశ్వరవాణి
మేఘములోనుండి పలికినది. అనగ "ఇంద్రియనిగ్రహముకలిగి
యుండుడు. త్యాగముచేయుడు. దయకలిగి యుండుడు" అని;
గనుక ప్రతివారును దానము అనగా త్యాగము, దమము

అనగా ఇంద్రియ నిగ్రహము, దయఅనగా ప్రేమ, అనుమూడు సద్గుణములను బాగుగా అభ్యసింపవలెను.

That very thing is repeated by the heavenly voice the cloud as 'Da,' 'Da,' 'Da,' control yourself ; 'Give and have compassion'. Therefore, every one should practice these three virtues, self control, self sacrifice and love.

9. శ్రద్ధయా దేయం; అశ్రద్ధయాఽ దేయం;
శ్రియా దేయం; హ్రియా దేయం;
భియా దేయం; సంవిదా దేయం;

తైత్తిరీయ శిక్ష, ఏకాదశ 6.

దానము చేయునపుడు శ్రద్ధగా చేయవలెను. అశ్రద్ధగా చేయ గూడదు. సంతోషముగాను, అడకువతోను భయభక్తుల తోను, సంకల్ప పూర్వకముగాను దానము చేయవలెను.

Gifts must be made with diligence but never in a careless manner. When you make a gift you must do it with pleasure, humility, fear and willingness.

10. అథ యత్తపో దాన మార్జవ మహింసా
సత్యవచన మితి తా అస్య దక్షిణాః.

ఛాందోగ్య తృతీయ సప్తదశ 4.

తపస్సు, త్యాగము, అందరియందును సమభావము, అహింస, సత్యము, అనునవియే ఈ యజ్ఞమునకు దక్షిణలు.

Tapas (concentrated meditation), self sacrifice, treating all alike, non-violence and truth are the only offerings in this yagna (sacrifice.)

[వరా:—దీనినిగూర్చి పై అయిదవ పాఠము 1 వ మంత్రములో చెప్పబడిన వరాను చూడుము.]

11. సత్యమేవ జయతే, నానృతం,

సత్యమే జయించును. అసత్యము జయించదు.

ముణ్డక తృ. ప్ర. 6

Truth alone will triumph. Untruth will never succeed.

12. సత్యంవద, ధర్మంచర. తైత్తిరీయ శిక్ష ఏకాదశ 1.

సత్యము పలుకుము. ధర్మముగా ప్రవర్తించుము.

Be truthful; Let your conduct be righteous.

13. తచ్ఛ్రేయో రూప మత్యసృజత ధర్మం తస్మా
ద్ధర్మా త్పరం నాస్తి అథో అబలీయాన్
బలీయాంస మాశంసతే ధర్మేణ
యోవై సధర్మః సత్యం వై తత్.

బృహదారణ్యక 1-4-14.

ధర్మము అను ఉత్కృష్టమైన రూపమును ఆయన (పరమపురుషుడు) దాల్చెను. ధర్మము కన్న గొప్పది లేనేలేదు. తనపక్షమున ధర్మముగల బలహీనుడు ఎంతటి బలవంతునైన నోడించగలడు. ధర్మమే సత్యము.

He (Paramaatma) projected that excellent form of His, namely Dharma (righteousness and justice). There is nothing higher than Dharma. Even a weak man can defeat a mighty person with the weapon of Dharma. Dharma is truth.

14. సత్యాన్నప్రమదితవ్యం, ధర్మాన్నప్రమదితవ్యం
కుశలాన్నప్రమదితవ్యం, భూత్యై నప్రమదివ్యం.

తైత్తిరీయ. శిక్ష. ఏకాదశ. 2.

సత్యమునుండి తప్పిపోకుము. ధర్మనిర్వాహణము నుండి తప్పిపోకుము. యోగ్యమైన కార్యములనుండి తప్పిపోకుము. పరోపకార కార్యములనుండి తప్పిపోకుము.

Do not swerve from truth. Do not swerve from duty. Do not swerve from righteous conduct. Do not swerve from doing good to others.

15. ఋతంచ స్వాధ్యాయ ప్రవచనేచ
సత్యంచ స్వాధ్యాయ ప్రవచనేచ
తపశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ
దమశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ
అగ్నయశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ
అగ్నిహోత్రించ స్వాధ్యాయప్రవచనేచ
అతిథయశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ
మానుషంచ స్వాధ్యాయ ప్రవచనేచ
ప్రజాచ స్వాధ్యాయ ప్రవచనేచ
ప్రజనశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ
ప్రజాతిశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ

తైత్తిరీయ, శిక్ష. వల్లి 1.

ధర్మమునుగూర్చి బాగుగ దెలిసికొని ఆచరించుచు ఇతరులకు బోధించవలెను.

సత్యమును గూర్చి ,,
తపస్సును గూర్చి ,,
ఇంద్రియ నిగ్రహమును గూర్చి ,,
మనః పారిశుద్ధ్యమును గూర్చి ,,
కొన్ని మంచిసమయములందు ప్రత్యేకముగ
చేయుఅగ్నిహోత్రమును గూర్చి ,,
నిత్యాగ్నిహోత్రమును గూర్చి ,,
అతిథిని గౌరవించుటను గూర్చి ,,

సిరిసంపదలకు, ప్రపంచ వ్యవహారములకు

కావలసిన విద్యలను గూర్చి ఇరులకు బోధించవలెను

పిల్లల పెంపకమును గూర్చి ,,

ధర్మపత్నికి సంబంధించిన ధర్మములనుగూర్చి ,,

కుటుంబధర్మములను గూర్చి ,,

You should learn properly and act up to it, and preach to others about Dharma

,, Truth
,, Thapas
,, Self control
,, Mental purity
,, Performing oblutions in fire on auspicious occasions
,, Performing oblutions in fire every-day
,, Hospitality
,, Sciences necessary for prosperity and worldly affairs
,, Bringing up childern
,, Your duties to your wife,
,, Your duties as a house-holder.

[వరా:—1. ఇంద్రాదిదేవతల ప్రీత్యర్థము గాక పర బ్రహ్మము నపేక్షించి అగ్నిహోత్రములో హోమము చేయుట కూడ నొక ఆరాధనావిధానముగా ముణ్డకోపనిషత్తు (ప్ర. ద్వి. 1) లో చెప్పబడియున్నది. సాధారణముగ ఈశ్వరారాధన మానసికముగనే చేయుట ఉపనిషత్తులలో చెప్పబడియున్నది. ఏకాదశోపనిషత్తులలో నెచటను విగ్రహారాధనము చెప్పబడియుండలేదు. ఛాందోగ్యోపనిషత్తు త్రయోవింశఖండములో కూడ గృహస్థాశ్రమమునందు అగ్నిహోత్రములో

పరమాత్మ నుద్దేశించి హోమము చేయుటనుగూర్చి చెప్ప బడినది.

2. మానవులకు ధర్మార్థకామ మోక్షములను చతుర్విధ పురుషార్థములను కలుగచేయ నుద్దేశించిన మహామంత్రమిది. "మానుషం చ" అని చెప్పుటలో ధనసంపాదనకు కావలసిన వ్యవసాయము, వర్తకము, పరిశ్రమలు మొదలగు వృత్తివిద్యలు వైద్య, శిల్ప, ఇంజనీయరింగు, ప్రకృతి శాస్త్రములు, జ్యోతిష రాజకీయార్థిక శాస్త్రములు, పరిపాలనా విధానము, సైనిక శిక్షణము, ధర్మశాస్త్రము మొదలగు పై 5వ పాఠముయొక్క 6వ మంత్రము క్రింది షరాలో బ్రహ్మచర్యాశ్రమములో చదువు విద్యలన్నియు ఇమిడియున్నవి. గృహస్థాశ్రమములో అవసరమైనవాటి నన్నిటిని ఎక్కువగా నేర్చుకొనుచు అను ష్ఠించుచు ఇతరులకు బోధించుచుండవలెనని చెప్పబడినది. వీటి వలన గృహస్థు మంచిజ్ఞానసంపాదనము చేసి జ్ఞానవ్యాపకము చేయుచు ద్రవ్య మార్జించి చక్కగా కుటుంబనిర్వాహణము చేయును. భోగము, త్యాగము రెండును అతని ధర్మములు. తాను సంపన్నుడై జాతీయ ధనమును పెంపొందింపజేయును. తాను ధార్మికుడై దేశములోని ధార్మికబుద్ధిని వృద్ధిచేయును. ఖద్దరుగృహపరిశ్రమలవలన స్త్రీలుకూడ కుటుంబ ఆదాయమును వృద్ధిచేసిరి. భారత జాతీయ జీవనమునకు పునాది సంస్థ (Social Unit) కుటుంబమైయున్నది గాని వ్యక్తికాదు. అందువల్ల వివాహము మత ధర్మమైయున్నది. గాని కంట్రాక్టు కాదు. కుటుంబములోని భార్యాభర్తలిరువురును ప్రేమకలిగి సుఖ ముగా నుండవలెను. ఒకరినొకరు ఇంద్రియలోలత్వమునకును,

స్వార్థపరత్వమునకును కేవలము ధనకాంక్షకును లొంగక ఉభయులును, విద్యావంతులై, జ్ఞానవంతులై, జితేంద్రియులై, త్యాగశీలురై, దేశసేవానిరతులై, ధర్మాచరణమునందు పరస్పర సహాయులై, మోక్షాసక్తులై యుండవలెను. భోగముతో పాటు త్యాగము కలిగియుండవలెను. నీ ఆస్తిని త్యాగబుద్ధితో అనుభవింపుము, ఇతరులదానికొరకు ఆశించకుమని చెప్పబడియున్నది. సంతానముకొరకు మాత్రమే సంభోగము చేయవలెనుగాని కామేచ్ఛను వృద్ధిపొందించుకొనకూడదను ఆదర్శము విధిగా చెప్పబడినది. ఇటుల చేయుటకూడ బ్రహ్మచర్యవ్రతమనియే చెప్పబడుచున్నది. మంచి పుత్రులను పుత్రికలను కని బాగుగా పెంచి దేశమునకు మేలు చేయవలెను. భార్యాభర్తలెంతయోగ్యులైన వారి పుత్రులును, పుత్రికలును అంతయోగ్యులగుదురు. కావుననే ఈ మంత్రములో ధర్మపత్నితో ఎటుల కాపురము చెయ్యవలెనో, సంతానము నెటుల కని పెంచవలెనో, కుటుంబము నెటుల వృద్ధిచేసికొనవలెనో, ఇంటికి వచ్చిన అతిథుల నెటుల గౌరవించవలెనో, (ప్రజాచ, ప్రజనశ్చ, ప్రజాతిశ్చ, అతిథయశ్చ, స్వాధ్యాయ ప్రవచనేచ) తెలిసికొని ఆచరించుచు ఇతరులకు బోధ చేయవలెను అని శాసించబడినది. ఇతర ఆశ్రమములకంటె కూడ గృహస్థాశ్రమము చాల ముఖ్యమైనది. ఆదర్శప్రాయమైన గృహస్థు ఆ కాలములో జనకమహారాజు. బ్రహ్మచర్యాశ్రమమునుండి సరాసరిగాను, గృహస్థాశ్రమము నుండియు, సన్యాసాశ్రమమును స్వీకరించి యావత్కాలము దేశసేవలోను మానవసేవలోను కాలముగడపు యతులను పోషించుట గృహస్థుయొక్క ధర్మము. గురుకులాశ్రమములను (residential universities) స్థాపించి నడుపుచున్న ఆచార్యులను

పోషించువిధికూడ పరిభుత్వముతోపాటు గృహస్థులమీాద నున్నది. [సమస్తమైన జాతీయప్రతిష్ఠాపనలను త్యాగశీలురను గృహస్థులు పోషించవలసి యున్నది.]

16. ఉత్తిష్ఠత జాగ్రత
ప్రాప్య వరా న్నిబోధత.

కఠ. ప్ర. తృ. 14

లేవండి, మేలుకోండి, సరియైన బోధను పొంది గమ్య స్థానమును జేరండి.

Arise, awake, being properly enlightened, attain the goal.

శాంతిమంత్రము

ఓమ్ ఆప్యాయన్తు మమాఙ్గాని, వా క్ప్రాణశ్చక్షు శ్శ్రోత్ర
మథోబల మింద్రియాణి చ సర్వాణి,సర్వం బ్రహ్మౌపనిషదం
మాఽహం బ్రహ్మనిరాకుర్యాం, మామాబ్రహ్మనిరాకరో
దనిరాకరణమ, స్త్వనిరాకరణం మేఽస్తు
తదాత్మనిర తేయ ఉపనిషత్సు ధర్మా, స్తేమయిన స్తు తేమయి సన్తు

కేనోపనిషత్, శాంతి మంత్రము.

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః

నా అంగములు వాక్కు ప్రాణము కన్నులు చెవులు అదేవిధముగ నా యొక్క అన్ని ఇంద్రియములు బలము, నా స్వధర్మనిర్వాహణము నకుగాను శక్తిమంతములై యుండును గాక. సర్వమును ఉపనిషత్తులలో ప్రతిపాదింపబడినట్లు బ్రహ్మాత్మకమే. నేను ఈశ్వరుని వదలిపెట్టను. ఆయన నన్ను త్యజించడు. నేను ఈశ్వరుని, ఈశ్వరుడు నన్ను వదలిపెట్టకుండెదము

గాక. పరమాత్మాసక్తులకు ఉపనిషత్తులలో ఏ ధర్మములు (సుగుణములు) చెప్పబడియున్నవో అవి నాయందుండునుగాక, అవి నాయందుండునుగాక.

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.

May my limbs, speech, life, eyes and ears and similarly all my senses and vitality increase in strength and make me fully fit to discharge my Dharma properly. All is Parabrahma as described in the Upanishads. I shall never give up God. He will never forsake me. May both of us (God and my self) not be separated from one another. May all the virtues prescribed by the Upanishads for seekers after God reside in me. May they reside in me.

Om; Peace; Peace; Peace:

# అనుబంధము 1

# స్త్రీల ఉన్నతస్థితి



ఉపనిషత్తుల కాలమున స్త్రీలకు సర్వవిధములను పురుషులతోపాటు సమానమగు హక్కు- బాధ్యతలు గౌరవప్రతిపత్తి ప్రబలియుండెను. ఆనంగతిని ఋజువు చేయుటకు ఈక్రింది మంత్రములను ఇవ్వడమైనది.

1. నవైనైవరేమే తస్మాదేకాకీ న రమతే; న
ద్వితీయమైచ్ఛత్ ! నహైతావానాన
యథా స్త్రీపుమాంసౌ సంపరిష్వక్తౌ
స ఇమమేవాత్మానం ద్వేధాపాత
యత్ తతః పతిశ్చపత్నీచా భవతామ్
తస్మా దిద మర్ధ బృగల మివ ఖ ఇతిహ
స్మాహ యాజ్ఞవల్క్యః తస్మాదయ మా
కాశః స్త్రియా పూర్యత ఏవ; తాం సమ
భవత్ తతోమనుష్యా అజాయన్త.

బృహదారణ్యక. 1-4-3

"(ప్రథమ) పురుషుడు సుఖముగా నుండలేదు. ఒంటరిగా నుండువారికి సుఖములేదు. తనకు సహచారిణి కావలెనని కోరెను. శరీరమును పెద్దదిగచేసి భార్యాభర్తలు కౌగిలించుకొని యొకటిగానున్నటుల సృష్టించుకొనెను. అంతట ఆ పెద్ద శరీరమును రెండు సమభాగములుగా విభజించెను. అందులో

నుండి భార్యాభర్త లిరువు రుద్భవిల్లిరి. కాబట్టి ఈశరీరము (పురుషుని శరీరము) తనలో సగభాగమే. రెండు సమచెక్కలుగా చీల్చబడిన బటాణీగింజయొక్క ఒక చెక్కవలె సగభాగమై యున్నది. మిగిలిన సగభాగము (వివాహమాడి) భార్యను తెచ్చుకొన్నప్పుడే పూర్తియగును. అప్పుడాయన ఆమెతో కలిసిపోయి యేకమగుదురు. వారిద్దరి సంయోగమునుండి మానవులు జన్మించిరి, అని యాజ్ఞవల్క్యమహర్షి చెప్పెను." ఈ మంత్రమువలన పురుషుడు స్త్రీ ఒకే శరీరములోని సగభాగములనియు సమానహక్కు బాధ్యతలు కలవారనియు తేలుచున్నది. భారతవర్షముయొక్క ఆదర్శము అర్ధనారీశ్వరుడగు ఈశ్వరుడు. ఆయన తన భార్యయగు పార్వతిని (శక్తిని) సగభాగముగ చేసికొనియున్నాడు. ఉపనిషత్తులు గృహస్థాశ్రమమును ప్రశంసించుచున్నవి. వివాహము కాకముందు పురుషుడు సుఖముగా నుండడు, తనలో సగముగానే యుండును. ఈ కొరతను తీసివేసి తాను పూర్తియగుటకుగాను వివాహమాడి భార్యను తెచ్చుకొనును, అని శ్రీ శంకరాచార్యులవారే తమ భాష్యములో వ్రాసినారు. "నీ భార్యయందును పిల్లలయందును ప్రేమ నీ యాత్మోన్నతికి తోడ్పడును. నీలో ప్రేమ అను సద్గుణము వృద్ధియై దేశమును మానవకోటిని, సర్వవిశ్వమును ప్రేమించుటకు దారి తీయును." అని బృహదారణ్యకోపనిషత్తు చెప్పినది. సుఖమైనట్టియు శాంతియుతమైనట్టియు ప్రేమపూరితమైనట్టియు ఆత్మోన్నతికి తోడ్పడునట్టియు కుటుంబము భారతజాతీయ జీవనమునకు ప్రథమపునాది (Unit) గా చేయబడినది. అందువల్లనే ఋషులకును గృహపరిశ్రమలకును

మనదేశములో నెల్లప్పుడును ప్రాముఖ్య మివ్వబడుచున్నది. అంతేకాని ప్రస్తుత సోవియట్ రష్యాలోవలె భారతజాతీయ జీవనమునకు పునాది వ్యక్తి (Individual) కాదు. అందువల్ల భరతవర్షములో వివాహము మతధర్మమై యున్నది. భార్యాభర్తలసంబంధము పవిత్రము. ఎపుడు పడితే అపుడు తెంచుకొనునదికాదు. వారిసంతానమునకు వారసత్వపుహక్కు గలదు. సోవియటురష్యాలో వివాహము ఒక పురుషుని మధ్యను ఒక స్త్రీ మధ్యను కంట్రాక్టు అయియున్నది. ఎపుడుపడితే అపుడు ఏ కారణము చెప్పకుండగనే వారిలో నెవరి కోరికమీదనైనను ఆ కంట్రాక్టును రద్దుపరచుకొనవచ్చును. అది స్వేచ్ఛ అని వారనెదరు. సాంఘిక అరాజకమని మన మనెదము. వారికి పుట్టిన సంతానమునకు వారసత్వపు హక్కులేదు. గావున అచట వివాహపు కంట్రాక్టుకూడ ప్రభుత్వ రిజిస్టరులో నమోదు చేయించుకొనకుండగనే స్త్రీ పురుషులు కలసి కాపురముచేసి పిల్లలను కనుటకూడ దోషముగా నెంచబడుటలేదు. ఇట్టి దానిని భారతవర్షము అంగీకరింపజాలదు. మనదేశములో గృహస్థాశ్రమములో కూడ భార్యాభర్త లిరువురును బ్రహ్మచర్యవిధులను నిర్వర్తించుచు ధర్మసంస్థాపనా యజ్ఞములో భాగస్వాములై మంచిసంతానమును కని చక్కగా పెంచి దేశమున కిచ్చి కృతార్థులు కావలెను. సంతానము కొరకే భార్యతో సంభోగము చేయవలెను కాని ఆమెను పురుషుడు తన ఇంద్రియ లోలత్వమునకును తనివితీరని కామేచ్ఛను తీర్చుకొనుటకును పనిముట్టుగా చేసికొనరాదని బ్రహ్మచర్యవిధులను గృహస్థాశ్రమములోకూడ ఉపని

పత్తులు విధించినవి. అమృతముకొరకు సముద్రమథనము చేయుటలో ముందుగా హాలాహలము (ఘోరవిషము) పుట్టి లోకములను దహించుచుండెను. దేవతలు మానవులు అందరు ఆ హాలాహలమును మ్రింగి లోకములను రక్షించవలెనని శివుని ప్రార్థించిరి. శివుడు ఈ ధర్మ సంస్థాపనా కార్యము చేయుటకై యీ ఘోరవిషమును మ్రింగుదునా యని తన సగభాగమగు పార్వతియొక్క అనుమతిని అడిగెను. ఆమె ఇట్టి మహాయజ్ఞము నందు తనభర్త కెట్టియాపదవచ్చినను సరేనని యెంచి ఆ విష మును మ్రింగి లోకములను రక్షించుట ధర్మమని ఆయనకు గట్టిగా ప్రోత్సాహమిచ్చినది. "మ్రింగెడువాడు విభుండని, మ్రింగెడిదియు గరళమనుచు, మేలని ప్రజకున్, మ్రింగుమనె సర్వమంగళ" అని పోతన్నగారు శ్రీమద్భాగవతములో వ్రాసి నారు. ఆయన దానిని మ్రింగెను. ఈ విషము తన కడుపు లోనికి పోయినచో అక్కడ నున్న లోకములు కాలిపోవునని యెంచి దానిని తన కంఠమునందే యుంచుకొనెను. ఆయనకు గరళకంఠుడని పేరువచ్చినది. ఇంతకన్న భార్యా భర్తల ఆదర్శప్రాయమైన ధర్మసంస్థాపనకొరకు త్యాగము ఏమి యుండగలదు? సర్వమానవులకు త్యాగముయొక్క యుత్కృ ష్టతను తెలుపుటకు గాను ఈ కథ శ్రీమద్భాగవతముయొక్క అష్టమస్కంధమునందు చెప్పబడినది.

ఇంకొకటి యేమనగా తన మిగిలిన సగభాగమును ఒక భార్యను వివాహమాడి పూర్తిచేసికొని యుండగా, ఒక పురు షుడు తనకొక భార్య యుండగా రెండవభార్యను తెచ్చుకొనుట ఉపనిషద్ధర్మములకు కేవలము వ్యతిరేకమే. "ఒక పత్ని,

ఒకమాట, ఒక బాణము" అని త్యాగరాయలవారు స్తోత్రము చేసిన ఏకపత్నీవ్రతస్థుడును, సత్యసంధుడును, మహా శూరుడును అగు శ్రీరామచంద్రమూర్తి భారతదేశమునకు పరమపూజ్యుడయిన ఆదర్శమూర్తి. కాని కొన్ని కఠిన పరిస్థితులలో ననగా విడిచివేయుట, క్రౌర్యము, వ్యభిచారము లను దుర్గుణములు కలుగుటవలన వివాహముయొక్క మత ధర్మము నాశనమైనపుడు మాత్రము, అందువలన బాధపడు చున్న పురుషునకైనను స్త్రీకైనను వివాహ విచ్ఛేదపు హక్కు కలుగజేయుచు శాసనము గావించుట సమంజసమై యున్నది. ఈ హక్కు ప్రాచీనభారతదేశములో నుండినటుల పరాశర స్మృతి చదివిన తెలియగలదు. దానిని తీసివేసి స్త్రీకి అన్యాయముచేసి, పురుషుడు తానుమాత్రము పెక్కుమంది భార్యలను వివాహమాడసాగెను. భార్య బ్రతికియుండగ పైకారణములచే న్యాయాధిపతివద్ద వివాహవిచ్ఛేదపు తీర్పు పొందనిది పురుషుడు రెండవభార్యను వివాహమాడు చెడు ఆచారమును నిషేధించుచు వెంటనే శాసనము గావింపబడవలెను. ఉపనిషత్తులకు చాలకాలమునకు స్త్రీ అస్వతంత్రురాలను సిద్ధాంతము స్వార్థపరులగు పురుషులచే వ్యాపింప చేయబడి స్త్రీలకుగల సమాన ప్రతిపత్తి చాలవరకు తగ్గినది. స్త్రీలకు వేదము చదువుటకు అధికారమును తీసివేసినారు. ఆస్తియందు గల హక్కులను చాలగ తగ్గించినారు. ఇపుడు మరల స్త్రీలకు పురుషులతో రాచకీయ సాంఘిక మత విషయము లందును ఆస్తిహక్కుల యందును సమాన ప్రతిపత్తి కలుగవలెను. అటుల కలుగజేయుటకు దేశములో ఉపనిషద్ధర్మముల వ్యాప

కము ఎంతయో తోడ్పడగలదు. ఉపనిషత్తుల ప్రకారము స్త్రీలు పురుషులు కూడ జీవాత్మలే గనుక సమానులు. సహజ స్వతంత్రము గలవారు.

2. మాతృదేవోభవ; పితృదేవోభవ; ఆచార్యదేవోభవ అతిథిదేవోభవ; తైత్తరీయ శిక్ష-ఏకాదశ 3.

ఈ మంత్రములో తండ్రి కంటెను, ఆచార్యుని కంటెను, ముందుగా తల్లిని దేవతవలె పూజించి గౌరవించవలెనని చెప్పియున్నారు.

3. (అ) సయ ఇచ్ఛేత్పుత్రోమే శుక్లోజాయేత, వేద మనుబృవీత సర్వమా యురి యాదితి, క్షీరౌదనం పాచ యిత్వా సర్పిష్మన్త మశ్నీయాతామ్; ఈశ్వరౌ జనయితవై.

బృహదారణ్యక 6. 4-14.

ఎవరైతే తనకు అందమైనట్టియు పూర్తియగు ఆయుర్దాయము కలిగినట్టియు మంచి పండితుడైనట్టియు కుమారుడు కావలెనని కోరునో ఆయన ఆయన భార్య, పాలతో వండిన అన్నములో మంచి వెన్న కలిపి భుజించవలెను. అటువంటి కుమారుడు వారికి కలుగును.

He, who wishes that his son should be born fair become a scholar, and attain a full term of life should have rice cooked in milk and he and his wife should eat it with clarified butter. Then they will be able to produce such a son.

(ఆ) అథయ ఇచ్ఛేద్ దుహితా మే పండితా జాయేత సర్వమాయురియాదితి, తిలౌదనం పాచయిత్వా సర్పిష్మన్తమశ్నీయాతామ్; ఈశ్వరౌ జనయితవై.

బృహదారణ్యక, 6-4-17.

అటులనే తనకు మంచిపండితురాలైనట్టియు సంపూర్ణమగు ఆయుర్దాయము కలుగునట్టియు కూతురు కావలెనని కోరువాడు నువ్వులతో వండిన అన్నమును మంచి వెన్నను కలిపి తన భార్యతోనహా భుజించవలెను. అపుడు వారికట్టి కుమార్తె కలుగును.

He who wishes that a daughter should be born to him who would be a scholar and attain a full term of life should have rice cooked with seasamum and he and his wife should eat it with clarified butter. Then they would be able to produce such a daughter.

ఈ రెండు మంత్రములవల్ల అప్పటివారు పండితులగు కుమారులనేగాక పండితురాండ్రగు కుమార్తెలనుగూడ కనవలెనని ఎంత ఆతురత చూపుచుండిరో విదితమగుచున్నది. సంఘమునందు, గృహమందు కుమారులకు కుమార్తెలకు సమానవిద్య, సమానగౌరవము కలిగియున్నవనుట నిర్వివాదాంశము.

4. గార్గి:—

ఈమె వచక్ను అను విద్వాంసుని కూతురు. బ్రహ్మచారిణి. బ్రహ్మజ్ఞాని. అతిగొప్ప విద్వాంసురాలు. ఉపనిషత్తులలో కెల్ల ముఖ్యమైనదని శ్రీ శంకరాచార్యులవారిచే సెంచబడిన బృహదారణ్యకోపనిషత్తులో చాల భాగము జనకమహారాజుయొక్క దర్బారులో జరిగిన పండిత సమావేశములందు యాజ్ఞవల్క్యఋషి పరబ్రహ్మతత్వమును గూర్చి చేసిన వాదోపవాదములతో నిండియున్నది. జనకమహారాజు వెయ్యిగోవుల పందెము పెట్టెను. యాజ్ఞవల్క్యఋషి నోడించవలెనని అనేకమంది పండితులాసభలో అనేక ప్రశ్నలను వేసినను

వాటి కన్నిటికి సరియైన జవాబులు ఆయన చెప్పి సభాపూజ్యు డయ్యెను. ఆ సమయముననే గార్గి కూడ లేచి కొన్ని ప్రశ్నలు యాజ్ఞవల్క్యుని వేసెను.

ఆమె ఇటుల చెప్పెను. "పూజ్యులగు పండితులారా! నేను యాజ్ఞవల్క్యుని రెండు ప్రశ్నలు అడుగబోవుచున్నాను. ఆయన వాటికి సరియైన జవాబులు చెప్పినచో, పరబ్రహ్మ మును గూర్చి నిర్వచించుటలో మీ రెవరును ఆయనను ఓడించలేరు. అడుగుదునా" అనెను.

"ఓ గార్గీ! అడుగుము" అని సభికులు చెప్పిరి. ఆమె యాజ్ఞవల్క్యుని జూచి, యాజ్ఞవల్క్యా! నేను నిన్ను రెండు కఠిన మైన ప్రశ్నలు అడిగెదను. వాటికి ప్రత్యుత్తర మిమ్ము" అనెను.

"అటులనే అడుగుము, జవాబు చెప్పెదను" అని యాజ్ఞవల్క్యుడు బదులు చెప్పెను.

అందుమీద ఆమె కొన్ని చిక్కుగా నుండెడు ప్రశ్న లను పరమాత్మ తత్వమును గూర్చి వేసెను.

వాటి కన్నింటికి యాజ్ఞవల్క్యుడు చక్కగా జవాబు చెప్పెను.

అందుమీద ఆమె పండితులవంక జూచి "పూజ్యులగు బ్రహ్మజ్ఞానులారా! మీ రాయనకు (యాజ్ఞవల్క్యునకు) నమస్కారము చేసి వదలివేసినచో, మీ రదృష్టవంతులు, ఎప్పటికిని పరమాత్మ తత్త్వమును గూర్చి సరిగ నిర్వచించు టలో మీ రెవరును ఆయనను గెలువజాలరు" అని చెప్పెను. ఆమె అంతటితో మౌనము వహించెను.

బృహదారణ్యక 3-8-1 మొదలు 12 వరకుగల మంత్రములు.

యాజ్ఞవల్క్యుడు ఆసభలో గెలిచి వెయ్యిగోవుల బహుమానమును జనకమహారాజునుండి పొందెను.

5. మైత్రేయి—

యాజ్ఞవల్క్య ఋషియొక్క భార్య మైత్రేయి, గొప్ప విద్వాంసురాలు. పరబ్రహ్మతత్త్వమును గూర్చి బ్రహ్మజ్ఞానియు జీవన్ముక్తుడునగు తన భర్త (యాజ్ఞవల్క్యుని)తో చర్చలు సలుపుచుండెను.

బృహదారణ్యక, 4-5-1.

ఒక దినమున గృహస్థాశ్రమమును విడిచివేసి అడవులకు పోయి తపస్సు చేయవలెనని యాజ్ఞవల్క్యుడు సంకల్పించి, తన భార్యయైన మైత్రేయిని పిలిచి "నేనీ ఆశ్రమమును వదలివేసి, వానప్రస్థ - సన్న్యాస ఆశ్రమమును అవలంబించ దలచినాను. నాకు గల ఆస్తిని తీసికొనుము. నేను నీతో ఇదివరకు గల సంబంధమును వదలుకొనుచున్నాను." అని చెప్పెను. అందుమీద మైత్రేయి ధనముతో కూడిన ప్రపంచమంతయు నాకు లభించినను నాకేమి లాభము? అందువలన నాకు శాశ్వతానందము కలుగు మోక్షము లభించునా? అని అడిగెను. "నిజమే ధనమువలన ఎవరికిని పరమపదము లభించదు. నీవు కూడ అందరి ధనవంతులతోపాటు ప్రాపంచిక వస్తువులను బాగుగా కలిగియుందువు." అని ఆయన బదులు చెప్పెను. "అటులైనచో మీ ఆస్తి నాకక్కరలేదు. నాకు శాశ్వత ఆనందము కలుగచేయుగల పరమపదవికి మార్గము

చూపి పొందు." అని ఆమె చెప్పెను. "ప్రియురాలా! నీవు ఇదివరకే నాకత్యంత ప్రియురాలవు. ఇపుడు నీవు కోరినది నా కెంతో సంతోషమును కలుగజేసినది. అయితే శ్రద్ధగా కూర్చొనుము. నేను నీకు పరమాత్మను గూర్చి బోధించెదను. నేను నీకు చెప్పుచున్నదానిని నీవు జాగ్రత్తగా మననము చేయుము." అని ఆయన చెప్పెను. ఆమెను కూర్చొనబెట్టి ఆమెకు ఉత్కృష్టమైన బ్రహ్మజ్ఞానము నుపదేశించెను. ఆమె అనేక సందేహము లడిగెను. వాటి కన్నింటికిని తగిన ప్రత్యుత్తరము లిచ్చి ఆమెకు సందేహములను నివృత్తి చేసెను. ఆమెకు ఆయన చేసిన బోధలు బృహదారణ్యకోపనిషత్తు 4 అధ్యాయములోని 5 వ భాగమునం దున్నవి. ఆమెకు సందేహములేని బ్రహ్మజ్ఞానమును కలుగచేసి ఆయన వనములకు తపస్సుకు వెళ్ళెను. ఆయన జీవన్ముక్తుడు. ఆమె కూడ జీవన్ముక్తురా లయ్యెను.

మైత్రేయికి యాజ్ఞవల్క్యుడు చేసిన ఉపదేశములకు శ్రీ శంకరాచార్యులవారు తమ ఉపనిషద్భాష్యమునందు చాల ప్రాముఖ్యము నిచ్చియున్నారు.

---

## అనుబంధము 2

# చాతుర్వర్ణములు

---

బృహదారణ్యకోపనిషత్తు పుట్టునాటికి చాతుర్వర్ణములు ఏర్పడినవి. అది జీవన్ముక్తుడైన జనకమహారాజుకాలము. మహాభారతమునందలి అరణ్యపర్వముయొక్క చతుర్ధాశ్వాసములో చెప్పబడిన కసాయివృత్తివలన జీవించుచు,జీవన్ముక్తుడై, కౌశికుడను బ్రాహ్మణునికి బ్రహ్మజ్ఞానమును ఉపదేశము చేసిన, ధర్మవ్యాధుని కథ కూడ జనకమహారాజుయొక్క కాలమునకు, ఆయన రాజధానికి, సంబంధించినదే. బ్రహ్మజ్ఞానమునకు, జీవన్ముక్తికి, మోక్షమునకు, వర్ణముతో పనిలేదని ఆ కథవలన స్పష్టపడుచున్నది. అపుడు వర్ణములు కేవల వృత్తుల విభజనకు సంబంధించియుండెను. అన్నివృత్తులకు సమానగౌరవముండెను. అన్ని వృత్తులవల్లను సుఖముగా కుటుంబపోషణము జరుగుచుండెను. అనవసరమైన పోటీని తీసివేయుటకై వర్ణవిభజన ఏర్పరచబడి వంశపారంపర్యమైన వృత్తియొక్క అవలంబనము ప్రోత్సహించబడినది.

బృహదారణ్యకోపనిషత్తు 1 అధ్యాయము. 4వ బ్రాహ్మణములో వర్ణములను గూర్చి ఇటుల చెప్పబడినది:—

"ప్రప్రథమమున ఇన్నివర్ణములులేవు. అంతయు పరబ్రహ్మమయమే గనుక మానవులందరును బ్రాహ్మణులనియే పిలువబడిరి. పరబ్రహ్మమునకు పని జరుగుటకు ఇది సరిగా కన

వడక, తనలోనుండియే క్షత్రియత్వమును సృష్టించెను. దేవత లలో అగ్ని బ్రాహ్మణుడుగనే యున్నాడు. దేవతలలో ఇంద్రుడు, వరుణుడు, చంద్రుడు, రుద్రుడు, పర్జన్యుడు, యముడు, మృత్యువు, ఇషాన, వీరు క్షత్రియులుగ నేర్పడిరి. మానవులలో కూడ క్షత్రియులకన్న ఎవరును అధికులులేరు. రాజసూయ యాగములో క్షత్రియుని, పైన కూర్చొనపెట్టి తాను క్రింద కూర్చొని, బ్రాహ్మణుడు క్షత్రియుని పూజించును. కాని బ్రాహ్మణుని క్షత్రియుడు అగౌరవముగ చూడరాదు.

ఇంతటితో పరబ్రహ్మమునకు తృప్తికలుగలేదు. అంతట తనలో నుండియే వైశ్యుని సృష్టించెను. వసువులు, రుద్రులు, ఆదిత్యులు, విశ్వదేవతలు, మరుత్తులు దేవతలలో వైశ్యులు ద్రవ్యమును సంపాదించుటయే పనిగా గలవారు కావలసివచ్చి నందున మానవులలో కూడ వైశ్యులేర్పడిరి.

ఇంతటితోను పనిపూర్తిగాక పరబ్రహ్మము తనలో నుండియే శూద్రులను సృష్టించెను. పుషాను అని శూద్రునకు పేరు. అందరిని పోషించుభూమి (ధరిత్రి) పుషాను అయి యున్నది. పుషానులనగ అందరిని పోషించువారని అర్థము.

ఈ విధముగా పరబ్రహ్మయే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాలుగువర్ణము లాయెను. ఇదియు చాలక పరబ్రహ్మము సర్వోత్కృష్టమైన దగు ధర్మమును సృష్టించెను. ధర్మమువల్ల ప్రజలనుపాలించుచు క్షత్రియుడనబడుచున్నాడు. ధర్మముకన్న ఎక్కువదైన దేమియులేదు. ధర్మముద్వారా బలహీనుడు బలవంతుని జయించగలడు. ధర్మమే సత్యము.''

బృహదారణ్యక. అ 1. బ్రా 4. మంత్రములు 11 నుం॥ 15 వరకు.

ఇందువలన వృత్తి విభజనకై బృహదారణ్యక ఉపనిషత్తు నాటికి చాతుర్వర్ణము లేర్పడెనని తెలియగలదు. అన్నియు పరబ్రహ్మముయొక్క భాగమేగనుక, ఎక్కువ తక్కువ భావములు బొత్తుగ లేకుండెను. వేదము చదువుటకేగాక యితరులకు వేదమును చెప్పుటకును బ్రహ్మచర్యాశ్రమ శిక్షావిధానమును పొందుటకును బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులతోపాటు శూద్రులకు కూడ సమాన అధికార ముండెనని పైన 5 వ పాఠము నె 6 రు మంత్రము క్రింద వ్రాసిన షరాలో చూపియుంటిమి. చాతుర్వర్ణములు గుణకర్మలవల్లనే ఏర్పడినవి కాని పుట్టుకవల్ల కావని, తరువాత చాలకాలమునకు వచ్చిన భగవద్గీతలో కూడ చెప్పబడి యున్నది. "జాతి (పుట్టుక) మాత్రంబున పురుషునికి వర్ణంబు నిర్దేశింపంబనిలేదు. శమ దమాది వర్ణలక్షణ వ్యవహారంబుల గనవలెను" అని శ్రీమద్భాగవత సప్తమస్కంధములో నారదుడు ధర్మరాజునకు చెప్పినటుల గలదు. కాని అటుపిమ్మట గతించిన వేలసంవత్సరములలో అప్పటి సాంఘిక,ఆర్థిక,వృత్తి కట్టుబాట్లు శిథిలములై పోయినవి. పరదేశములనుండి పారిశ్రామిక సరుకులు దిగి అన్ని స్వదేశ వృత్తులను నశింపజేసిన కాలములో ఏ వృత్తి వల్లను కడుపునిండ భోజనము దొరుకుటలేదు. వర్ణవివక్షత కేవలము పుట్టుకను బట్టి ఎంచుకొన బడుచున్నది. ఎక్కువ తక్కువల భావము, అహంకారములు పెరిగినవి. స్త్రీలు శూద్రులువేదము చదువకూడ దన్నారు. కానిద్విజులలోకూడ నెవరును చదువుట లేదు. వేదము చదవని ద్విజులు శూద్రు లగుదురనిమనుస్మృతిలో వ్రాయబడినది. గావున అందరును శూద్రులేమైనారు.

కాని పుట్టుకవల్ల మాత్రము ద్విజులు ఎక్కువవారమని అను కొనుచున్నారు. ఇది అక్రమము. వర్ణవ్యవస్థలో అరాజకము కలిగి నది. ఇంతేగాక వర్ణములు అనేక విధములుగ వందలకు వంద లుగ చీలినవి. దేశమునకట్టి లాభముకలుగ చేయకపోగ మిగుల అరిష్టదాయకములుగ నున్నవి. వీటినన్నిటిని ఐక్యపరచి గుణకర్మ విభాగమునుబట్టి మరల చాతుర్వర్ణములుగ సంఘమును విభ జించుట దుస్సాధ్యమైనపని. మన దేశములో వర్ణములను నమ్మని నూతన మతములు, సంస్కరణ మతములు అనేకము వచ్చి నవి. మనమందరము మానవసమానత్వమును, ప్రజాపాలనను రాజకీయముగను ఆర్థికముగను కోరుచున్నాము. వంశపారం పర్యముగ ఒకే వృత్తిని అవలంబించవలెనని ఎవరిని నిర్బంధించ జాలము. నవీన ప్రపంచ పరిస్థితులలో వృత్తులయొక్క ఆర్థిక విలువలు పాతకాలమునుండి నేడు పూర్తిగా మారినవి. కావున వర్ణవివక్షతను వెంటనే పూర్తిగ దీసివేయుటకంటె మార్గాంత రములేదు. వర్ణభేదములు పోయినంత మాత్రమున ఆశ్రమ ములు పోగూడదు. వర్ణములు కేవలము సాంఘికమైనవి. వృత్తు లకు సంబంధించినవి. ఆశ్రమములటుల గాక ఆధ్యాత్మిక జీవ నమునకు సంబంధించి శాశ్వతమగు విలువగలవి. సర్వవర్ణముల వారును ఆశ్రమధర్మములను అనుష్ఠించుటవలన చాల లాభము కలుగగలదు. వాటిని నిలువబెట్టుట చాల అవసరము. సర్వ వర్ణముల వారి ధర్మముల శ్రీమహాభాగవతము సప్తమస్కంధ ములో చెప్పబడిన దానిని పై 5 పాఠము నె 6 రు మంత్రము క్రిందవ్రాసిన వరాలో నుదహరించితిమి. వాటిని అందరును శ్రద్ధగా అనుష్ఠించుట ముఖ్యమైయున్నది.

"మానవుడు తన సహజ స్వభావమును, తన ప్రకృతిని అనగా తనజాతిని కార్యరూపమున కనపర్చుటకే, ప్రథమమున జాతి పుట్టెను. ఆ విధమున కొన్నివేల సంవత్సరము లుండెను. నవీన గ్రంథములలో కూడ జాతులమధ్య భోజన ప్రతిభోజనములు నిషేధింప బడలేదు. ప్రాతగ్రంథములలో వేటిలో కూడ అంతర్జాతీయ వివాహములు నిషేధింపబడి యుండలేదు. వర్ణవ్యవస్థ చాలగ నుపయోగపడినది. కాని ప్రస్తుతపు కుల భేదములు నిజమైన వర్ణవ్యవస్థకావు. నిజమైన వర్ణవ్యవస్థ పోయి ఉత్తమకులములు, తక్కువ కులములు అని అహంకార పూరితమైన భేదములు కలుగుటవలన భరతవర్షము పతనమైనది. ఈ కులభేదములను కొట్టివేయుడు. పూర్వపు జాతియొక్క పద్ధతిని అనగా వ్యక్తులయొక్క సహజమైన వ్యక్తిత్వమును పునరుద్ధరించుడు'' అని శ్రీ వివేకానందస్వామివారు భరతవర్షములో పనిచేయు మార్గము, అను ఉపన్యాసములో (A plan of Work for India) చెప్పి యున్నారు.

ఉపనిషత్తులు చాతుర్వర్ణములనుగూర్చి మాత్రమే చెప్పినవిగాని పంచమ వర్ణమున్నటుల నెచ్చటను చెప్పియుండ లేదు. పిమ్మట అనేక శతాబ్దములకు హిందుదేశములో పంచమ వర్ణ మనునది యేర్పడి వారిని అంటరానివారిగా నెంచి దూరముగానుంచు చెడు ఆచారము ఏర్పడినది. అంటరాని తనమును పోగొట్టవలెనని బుద్ధభగవానుడును శ్రీ రామానుజుల వారును ప్రయత్నము చేసియుండిరి. శ్రీ స్వామిదయానంద సరస్వతి, శ్రీ రాజారామమోహనరాయలు కూడ ప్రయత్నించిరి. శ్రీ వివేకానందస్వాములవారు అస్పృశ్యతాపిశాచ

మును బహు కఠినముగా ఖండించియున్నారు. మహాత్మాగాంధి అస్పృశ్యతను రూపుమాపుటకు సర్వప్రయత్నములను చేయుచున్నారు. ఆయన సలహాపైన నితర భారతీయనాయకులు కూడ తమ రాజకీయ కార్యక్రమములో అస్పృశ్యతా నివారణము నొక భాగముగ చేర్చుకొనియున్నారు. ఈ దురాచారము అతిత్వరితముగనే హిందూదేశమునుండి పూర్తిగ తొలగిపోగల సూచనలు కన్పట్టుచున్నవి. దానిని తత్క్షణము రూపుమాపుట ప్రతిభారతీయుని కర్తవ్యమై యున్నది.

"మన ప్రార్థనలలో ప్రతిదినము భగవంతుడు మన అందరియొక్క తండ్రియని అంగీకరించు మన జీవితము యొక్క ప్రవర్తనములో ప్రతి మానవుని మన సోదరుడుగ భావించనిచో నేమిలాభము? భరతవర్షమా! నీవ్యక్తిత్వమును కోల్పోయి ఇతరులను నీచముగా అనుకరించుట వలనను ఇతరుల మీద ఆధారపడుట వలనను, మరల నాగరికత యొక్కయు గొప్పదనము యొక్కయు ఉన్నతమైన్న శిఖరములను ఎక్కలేవు. ఓభారతీయుడా! నీ స్త్రీత్వముయొక్క ఆదర్శములు సీతా సావిత్రి దమయంతులై యున్నారని మరువకుము. నీవు పూజసేయు భగవంతుడు అష్టైశ్వర్యము లుండియు వాటినన్నిటిని త్యజించి బూడిద పూసికొనిన త్యాగులలోకెల్ల త్యాగియు ఉమానాధుడునగు పరమశివుడని మరచిపోకుము. నీ వివాహము, నీధనము, నీ ప్రాణము, నీయొక్క యింద్రియలోలత్వమును తృప్తిపరచుట కొరకును నీ స్వాంతసుఖము కొరకును కాదని మరచిపోకుము. పరమాత్మయొక్క యజ్ఞవాటికయందు ఒక సమిధగా త్యాగము చేయుటకే నీవు

పుట్టినావని మరచిపోకుము. తక్కువ జాతులని యెంచబడు వారు, అజ్ఞానులైనవారు, పేదవారు, నిరక్షరకుక్షులు, చెప్పులు కుట్టువారు, పాకీవారు, నీయొక్క రక్తములో రక్తము, నీమాంసములో మాంసము, నీకు సోదరులని మరచిపోకుము. ధీరుడా! ధైర్యము నవలంబింపుము. నీవు భారతీయుడవని గర్వపడుము. నేను భారతీయుడను, ప్రతి భారతీయుడు నా సోదరుడు అని గర్వముతో ప్రకటించుము. అజ్ఞానుడైన భారతీయుడు, పేదవాడైన భారతీయుడు, చింపిరిగుడ్డలలో నున్న భారతీయుడు, బ్రాహ్మణ భారతీయుడు, పంచముడగు భారతీయుడు నా సోదరుడు అని చెప్పుము" అని శ్రీ స్వామి వివేకానందులవారు (Modern India) నవీన భరత వర్షమను వ్యాసములో నుద్బోధన చేసియున్నారు. హిందువులు మునల్మానులు క్రైస్తవులు పారసీలు సిక్కులు అందరును నా సోదరులని చెప్పుము.

ఓం తత్సత్.



|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA10 HB 195 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 26-10-24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 155 |
| పెద్ద సైజు పేజీలు | నో |
| ఖాళీ పేజీలు | 1, 184 |
| లేని పేజీలు | నో |
| తయారు చేసినది | Kasimbi |
| పేజీలు విడదీసినది | kasimbi |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | No |
| తప్పులు | నో |
| పరిస్థితి | GOOD |